# ఆడమళయాళం

రచయిత:

శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు



శ్రీ కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్

ప్రాప్తిస్థలము: సరస్వతీ బుక్ డిపో. బెజవాడ.

స్వకీయ శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రితము

1943

 [వెల 0—6—0.

## : సూచన :

దయగలవారిని భగవంతుడు దయజూస్తాడు.
మానవజాతికంతటికీ దయ జీవితపరమా
వధి — దయాశూన్యమయిన హృద
యాలలో పిశాచములు కొట్లాడు
తవి. ఏ మతమయినా, ఏ కుల
మయినా, — దయారహిత
మయినప్పుడు భగవం
తుడు క్షమింపడు.



రచయిత.



౧

అది ఒక మిషన్ ఇండష్ట్రియల్ హోం. అక్కడ పెరుగుతూ వున్న, కొందరనాథబాలబాలికలకు దొరసానమ్మ బిస్కత్తులు-ఫెప్పరమెంట్లు, మొదలయినవాటిని పంచుతూ, వారితో ఆటలాడుతూ వుంటుంది.

మరియొకచోట, ఆ హోమ్‌లోనే పెరిగిన కొందరు యువతులు, మిషన్లపై దుస్తులు కట్టుట-లేసుపనిచేయుట-మొదలయిన కార్యాలలో నిమగ్నులై వుంటారు. ఆపరిసర మంతా చురుకుగాను, ఉత్సాహంగానూ వుంటుంది. ఎక్కడా విచార మనేది లేకుండా, ఎవరిముఖంలోకి చూచినా సంతోష రేఖలు తాండవిస్తున్నాయి.

ఇంతలో గేటుదగ్గర ఆగిన కారులోనుంచి హాస్పటలు పెద్దదొరసాని నెలసనమ్మ, లోపల కొచ్చి, అక్కడ పిల్లలతో సమానంగా ఆడుతూవున్న మోయరమ్మను చూచి, చాలా ఆనందపడింది. ఆమె తనలో తానే నవ్వుకుంటూ వారికి దగ్గరగా వెళ్లింది.

ఆటలాడుకుంటూవున్న బాల బాలిక లందరూ నెలసనమ్మకు సలాం చేశారు. నెలసనమ్మ, మోయరమ్మకు షేక్‌హాండు నిచ్చింది.

"మీ రీబాలబాలికలతో యిప్పుడే యింత ఉత్సాహంగా ఆటలాడుతున్నారుగదా; చిన్నవయస్సులో ఇంకా యెలా వుండేవారో—" అని నెలసనమ్మ నవ్వుతూ ఇంగ్లీషులో అంది.

"ఆవిషయం మీరే ఆలోచించుకోవాలి—"

అని మోయరమ్మకూడా నవ్వుతూనే సమాధానం చెప్పిన అనంతరం ఇరువురూ చెయ్యీ, చెయ్యీ కలుపుకొని, ఆచేరువలోని బంగాళాలోకి వెళ్లారు. ఇరువురూ చెరియొక కుర్చీలోనూ కూర్చున్న అనంతరం కాఫీ పుచ్చుకున్నారు.

"రంగూనుపై జపానుదాడి కొద్దిరోజులలోనే ఆరంభమవుతుందని మీకుకూడా తెలుసు ననుకుంటా" అని నెలసనమ్మ అంది మోయరమ్మతో."

"అవునవును. ఇప్పుడు దానిని గురించి యేమిటి?" అని మోయరమ్మ అడిగింది.

"మన మీాయుద్ధసమయంలో ఇంగ్లీషువారికి సాయ పడాలి గదా!"

"అవును. అన్నివిధాలా సాయపడాలి. ఈ ప్రబలయుద్ధంలో ఇంగ్లీషువారికి విజయము చేకూర్చుగాక అని నేను ఏసుప్రభువును అనుక్షణమూ ప్రార్థిస్తున్నాను.

మంచిది. అయితే యిప్పుడు కొందర నర్సులను కాకినాడ నుంచి రంగూన్ జరుగురుగా పంపించ వలసివుంది. మా హాస్పటలునుంచి కొందరను పంపుతున్నాను' నర్సు ట్రైనింగులో ఉత్తీర్ణులయిన యువతులు మీాహోంలోకూడా కొంద రున్నారు గదా! వారిలో మన స్ఫూర్తిగా అంగీకరించిన వారిని మాత్రం కొందరను పంపండి."

"Very good. తప్పకుండా పంపుతాను. ఇప్పుడే వెళ్ళి అడుగుదాము రండి."

అని మోాయరమ్మ నెలసనమ్మను వెంటబెట్టుకొని హోంలోకి వెళ్ళింది. అక్కడియువతు లందరూ తమతమ పనులలో నిమగ్నులై యున్నప్పటికీ ఆ దొరసానమ్మ లిద్దరకూ గౌరవ సూచకంగా సలాములుచేసి నిలుచున్నారు. అప్పుడక్కడున్న సుమారు ఏభై మందికీ మోాయరమ్మ ఉత్సాహంగా చెప్పింది.

"రంగూన్ ఎ. ఆర్. పి. సర్వీసులోకి కొందరు నర్సులు కావలసి వున్నారని నెలసనమ్మగారు చెబుతున్నారు. వారిహాస్పటలు నుంచి కొందరు నెడుతున్నారు కూడాను. మనహోంలో అందుకు పనికివచ్చే వారున్నా ఆనర్సు ట్రైనింగులోఉత్తీర్ణులయినవారునూ కొందరున్నారు. ఈ యుద్ధసమయంలో మన మందరమూ ఏకభవించి బ్రిటిష్ వారికి సాయపడి వారికి విజయమును చేకూర్చవలసిన బాధ్యత మనపై యెంతయినా వుంది. కనుక రంగూను హాస్పటలుకు నర్సులుగా వెళ్లాలని వుత్సాహంగా వున్నవారు తమ అభిప్రాయమును వెల్లడి చెయ్యండి. వారిని నెలసనమ్మగారు సంతోషంతో రంగూను పంపుతుంది."

అని మోాయరమ్మ చెప్పిన మాటలను ఆయువతు లందరూ విన్నారు కాని రంగూను ఎ. ఆర్. పి. సర్వీసులో చేరడానికి యిష్టంగా వున్నట్లు కనుపించలేదు. దానినిబట్టి—

"నిర్బంధం లేదు-ఇష్టమయినవారు మాత్రమే వెళ్ళవచ్చును."

అని నెలసనమ్మ చెప్పింది-ఎవరూ మాటలాడ లేదు.

"ఇంత మందిలోనూ ఒక్కరూకూడా సాహసవతులు లేక పోవడం చాలా విచారకరమయిన విషయం."

అని నెలసనమ్మ తిరిగి అంటుండగా జ్యోషీ సుమారు ఇరవై యేళ్ళవయసులోని అందగత్తె-ముందు కొచ్చి—

"నేను వెడతాను. ఎ. ఆర్. పి. సర్వీసులో చేరడానికి నాకు చాలా వుత్సాహంగా వుంది—"

అనిచెప్పింది. ఆమాటలు వినినదొరసానమ్మ లిద్దరూ, జ్యోషిని కౌగిలించుకొని, ముద్దాడి, వీపుమీాద తట్టారు.

"జ్యోషి మొదటినుంచీకూడా ఉత్సాహం కలిగినయువతి—"

అని మోాయరమ్మ చెప్పింది. వెంటనే మరినలుగురు యువతులు ముందుకు వచ్చి—

"జ్యోషితో మేముకూడా ఎ. ఆర్. పి. సర్వీసులో చేరడానికి రంగూను వెడతాము".

అన్నారు. అప్పుడు దొరసానమ్మలకు మరింత సంతోషమయి పోయింది. నెలసనమ్మ వారిపేర్లు వ్రాసుకొంది. ముందు జ్యోషీ సాహసం చెయ్యడంవల్లనే, మరికొందరు కూడా ఆమెతో ముందుకు వచ్చారని దొరసానమ్మలు తెలుసుకున్నారు.

అనంతరం వారు జ్యోషిని వెంటబెట్టుకొని ప్రియివేటు బంగాళాలో కొచ్చారు.

"జ్యోషీ! నీఉత్సాహాన్ని మే మధికంగా కొనియాడుతున్నాము. నీసాహసాన్ని అభినందిస్తున్నాము. నీయొక్క ధైర్యంవల్ల మాఇండస్ట్రియల్ హోంకు గొప్పప్రఖ్యాతి రాగలదు—"

అనిమోయరమ్మ జ్యోషిని తిరిగికౌగలించుకొని, కొనియాడింది.

"స్త్రీ పురుషవివక్షత లేకుండా, రోగులను కన్నబిడ్డలుగా చూచుకొని సేవలు చెయ్యాలి. ఒకవేళ ఆ ప్రాంతాలలో యుద్ధం ప్రారంభమైనప్పటికీ నీధైర్యసాహసాలను వొదిలిపెట్టకూడదు. నీ కక్కడ నెలకు అరవైరూపాయలు జీత మిచ్చి, ముందుముందింకా వృద్ధిలోకి తీసుకరాగలరు. ఈ కాకినాడ హాస్పటలుకు, ఈఇండస్ట్రియల్‌హోంకూ నీమూలంగా మంచిపేరు రాగలదు."

అని నెలసనమ్మ చెప్పగా—

"అమ్మా! మీ రీస్వల్పవిషయములో న న్నింతగా అభినందించడ మెందుకు? ఏ తలిదండ్రులో నన్ను కని, యీహోంకు అప్పగిస్తే ఈశరణాలయమే నాకు తల్లీ, దండ్రీ అయి, పెంచి, పోషించి, విద్యాబుద్ధులు చెప్పించి, ఇటువంటి వృద్ధిలోకి తీసుకొచ్చినప్పుడు, న న్నింత చేసిన ఈ ఇండస్ట్రియల్‌హోముకు ఈమాత్రం విశ్వాసమును చూపడంలో అంత విశేష మే ముంది? మీరు చెప్పిన విధంగానే రోగులకు సేవలు చేస్తాను. తలపై బాంబులవర్షం కురిసినా, నావిధ్యుక్తధర్మాన్ని నేను మరచిపోను."

అని జ్యోషి చెప్పిన, ఉత్సాహవంతమయినమాటలు వినగానే, దొరసానమ్మలకు మరింత ఆనంద మైపోయింది.

"నీవంటి యువతిని కలిగియున్నందుకు మా ఇండష్ట్రియల్ హోం ఎక్కువగా గర్వపడుతూ వుంది జ్యోషీ!"

అని మోయరమ్మ అనగా—

"నీతో వస్తూవున్న యితర యువతుల కందరకూ నాయకురాలవై నువ్వు వారికి హితబోధలు చేస్తుంటావు."

అని నెలసనమ్మ చెప్పింది.

"దయ-అహింస, మానవ ధర్మం వాటిని పాటిస్తున్నవారే మానవు లవుతారుగాని యితరు లందరూ కారు. ఏతలిదండ్రులకో జన్మించిన నువ్వు మా క్రైస్తవ మతమును స్వీకరించి ఆ ధర్మాల

నన్నింటినీ నేర్చుకన్నావు కాబట్టి నువ్విప్పుడాదర్శక్రైస్తవ యువతి కాగలవు.

దయగల వారియెడల భగవంతుడు దయ గలిగి యుండును. నువ్విప్పుడు చేయబోయేది ప్రజాసేవ అనేమహత్కార్యం. ఏసుప్రభువు నీలో నిలచి నీకార్యములందు నీకు విజయమును చేకూర్చుగాక!''

అని నెలసనమ్మ జ్యోషిని దీవించగా ఆమె దొరసానమ్మకు నమస్కరించి—

''మీ ఆశీర్వచనమును భగవంతు డాలకించి నాకు సాయం చేస్తాడు'' అని చెప్పింది.

''జ్యోషీ! నీప్రయాణానికి అవసరమయిన వస్తువులను సేకరించుకొని ప్రయాణానికి సిద్ధంగావుండు. ఎల్లుండి యిక్కడనుంచి రంగూనుకు స్టీమరు బయలు దేరుతుంది. నీ స్నేహితులతో అప్పటికి సిద్ధంగా వుండాలి.''

అని నెలసనమ్మ జ్యోషిని తిరిగి హెచ్చరించిన అనంతరం మోయరమ్మ దగ్గరకూడా సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

అనంతరం మోయరమ్మ జ్యోషిని దగ్గరగా తీసుకొని వాత్సల్యంతో ఆమెచేతులను స్పృశిస్తూ—

''జ్యోషీ! నువ్వు హిందువుల బిడ్డవు - నీలో ప్రవహించేది హైందవ రక్తం అయినప్పటికీ నీమూలంగా మాక్రైస్తవ మతానికీ— మా క్రైస్తవ మిషనులకు వన్నె వచ్చింది. అంత మందిలోనూ నువ్వు సాహసించి ముందుకు రాకపోయినట్లయితే నెలసనమ్మ దగ్గర నా కెంత అవమాన మయిపోయేదీ?'' అని అడిగింది.

''అమ్మా! నావిధ్యుక్త ధర్మాన్ని నేను మరచి పోలేను. నేనెవరి బిడ్డ నయినప్పటికీ పోషించినవారు మీరు, పెంచినవారు మీరు. ఇంత కాలం నుంచీ నా కాశ్రయమునిచ్చి— కాపాడిన, నా ఇండస్ట్రియల్ హోంయెడల, అవిశ్వాసంగా ప్రవర్తించినట్లయితే, ఏసు ప్రభువు మెచ్చుతాడా?

''జ్యోషీ! అటువంటి నైతికవృష్టి అందరకూ వుంటుందా? నీ

వల్ల నీదేశానికీ, నీసంఘానికీ ఎంతయినా మేలుకలుగుతుందని నే నాశి స్తున్నాను."

"ఏమోనమ్మా! నే నొక క్షుద్రస్త్రీని. నావల్ల ఎవరి కేమి జరుగ గలదు?"

"జ్యోషీ! అలా అనకు. మానవులలో వుండవలసిననిజరూపం నీలో వుంది. ఏసుప్రభువు కోరుకొన్న గుణాలన్నీ నీలో వున్నాయి. అంతకంటే, యిక కావలసిం దేముందీ? అన్నట్లు నెలసనమ్మ వచ్చిన తరువాత, తోటలో ఆడుకొంటున్న బాలబాలికల విషయమునే మరచి పోయాం. అక్కడకు వెడదామురా"

అనిచెప్పి, మోయరమ్మ జ్యోషిని వెంటబెట్టుకొని బాలబాలిక లుండే తోటలోనికివెళ్లింది. అప్పటి కింకా పిల్లలు ఆడుకుంటూనేవున్నా రు. మోయరమ్మ జ్యోషితో వెళ్ళగానే, అందరూ ఆటలను ఆపుజేసి నిలుచున్నారు.

"మనజ్యోషి రాబోయే యుద్ధవాతావరణంలో, ప్రజాసేవ చేసి, అనేకమంది రోగులను రక్షించడానికి, రంగూను వెడుతూవుంది. ఆమెయొక్క ఉత్కృష్టకార్యాలకు సాయంచేయవలసిందని, మన మంద రమూ ఏసుప్రభువుని ప్రార్థించాలి—"

అని చెప్పగా, ఆ బాలబాలికలు, జ్యోషికి చుట్టూ నిలచి— తాము నిత్యమూ పాడుతుండే, ప్రార్థనా గీతములను పాడారు. జ్యోషి నిమీలితనేత్రురాలై వారిమధ్యలో నిలుచుని, తానున్నూ, ఏసుప్రభు వుకు ప్రార్థనలు సలిపింది.

౨

"భగవతి నేమయినా అంటే, మీకాళ్లు పోతాయి."

"నువ్వాభగవతిమతంలో కలిసిందే గాకండా నాకాళ్లు పోవా లన్నమాట?"

"మీ రామెను చాలా అనాదరణగా మాటలాడుతున్నారు."

"ఆమెయొక్కమహిమ యేమిటో తెలుస్తే ఆదరణగా మాట లాడుదును."

"భగవతియొక్క మహిమ యింతింత అనడానికి వల్లా? ఏమీ లేక పోయినట్లయితే వేలాదిగా స్త్రీలు ఆమెకు శిష్యురాండ్రౌతారా?"

"అదీ- అంతేగాని, ఆవిడలో ఫలానామహత్తు వుంది—అందు వల్ల అందరూ ఆమెకు దాసులుకావాలని చెప్పలేవన్నమాట?.

"ఆవిడగారి మహత్తు యింతాఅంతా అవుతే మనం చెప్పుకో గలము- అయితే, ఆవిడ మేధస్సు మహాసముద్రం- జ్ఞానసంపత్తి అంతు లేనిది- ఆమెయొక్క ప్రజ్ఞావిశేషాలను వర్ణించడానికి, మనం కేవలం అనర్హులం."

"మంచిది"

"అదిగో! మళ్లీ ముసిముసినవ్వులు నవ్వుతున్నారు. భగవతిపేరు చెప్పేటప్పటికల్ల మీకు నవ్వొస్తుంది- అదే కూడదని చెప్తున్నా."

"ఇది మరీబాగుంది—యిప్పుడు నేను నవ్వానా?"

అని గోరా ఫక్కున నవ్వాడు. దానితో భవానికి మరింత ఒళ్లు మండిపోయింది.

"దీనిపే రేమిటీ?" అని తీక్షణంగా అడిగింది—

"నువ్వన్నదానికి నవ్వొస్తూంది."

అంతనవ్వొచ్చే మాటను యిప్పుడు నే నేమన్నాను?—"

"నేను నవ్వందేకూడా నవ్వుతున్నానంటున్నావు."

"మీలాంటి కొంటెమనిషి ప్రపంచంలో యింకెక్కడా వుండడు—"

"సరేగ్గాని, యిప్పు డింతకూ నువ్వనేదేమిటి?"

"ఏమీ లేదు—భగవతివల్ల ఉపదేశమును పొంది, మనం కూడా ఆమె మతంలో కలుద్దాం."

నువ్వు పొందు, ఆవుపదేశా లేమిటో, అంతేగాని నన్ను మాత్రం ఇబ్బంది పెట్టకు"

"అదేంమాట? కలుస్తే యిద్దరమూ ఆమతంలో కలవాలి. భార్యా భర్త లిద్దరలోనూ ఒకరిదోమతము యింకొకరిదొకమతమూ అయితే యెలాగు?"

"నాకు మనమతంమీద వుండే అభిమానం యింకేమతం మీదా లేదు. మనగీతాశాస్త్రంలోనూ - మనవేదాలలోనూ లేనట్టి వంటి ఉత్తమ మతం యింకెక్కడో వుందనుకోవడం చాలా తెలివి తక్కువ."

"మీలాంటి మూర్ఖులకు ఏమని చెప్పాలి? మనంగనక భగవతమ్మ మతం స్వీకరించామంటే భగవంతుడు ప్రత్యక్షంగా అవుపడతాడు. స్వర్గం అరచేతినిమ్మపండవుతుంది—"

"అంతా వట్టిమాట—"

"చాలు! యిక వూరుకోండి. మీ కెందులోనూ నమ్మకం లేదు. నేను తలబద్దలు కొట్టుకున్నా ఆ భగవతియొక్క మహత్తర ఆశయాలు మీ కర్థంగావు."

"నువ్వు తలబద్దలు కొట్టుకోను అక్కర లేదు. నా కామతం అర్థంగానూ అక్కర లేదు."

"అయితే మీ రామెవల్ల ఉపదేశమును పొంది తరించరన్న మాట?"

"ఊఁ! హుఁ! నా కవసరం లేదు."

"మరయితే యెలాగు? నే నామె మతమును స్వీకరిస్తాను."

"కానియ్యి- నాఅభ్యంతర మేమీ లేదు—"

"భార్యాభర్త లిద్దరిదీ ఒకేమతం గానప్పుడు చాలా గొడవలొస్తాయి. అప్పుడు మన మిద్దరమూ విడిపోవలసి వస్తుంది—"

అని భవాని చెబుతుంటే ఆమెయొక్క మూర్ఖత్వానికి గోరా ఒక వేడినిట్టూర్పును విడిచాడు. ఏమీ మాటలాడ లేదు.

"ఎటువంటి మొగవాడయినా యింట్లో ఆడది చెప్పినప్పుడు వినడ మంటుంది. నాముఖాన అటువంటి రాత యేమీ కనపడదు. నేను ఒకటంటే తమ రొకటంటారు. భార్యాభర్తల యిద్దరి మాటలూ అలకనప్పు డిక ఆ సంసార మెలా తుదనెగ్గుతుంది?"

"ఇష్టం లేకపోయినా సరే నువ్వు చెప్పినట్లు వినాలన్నమాట?"

'ఏందు కిష్టం లేదని అడుగుతున్నా. ఈ రంగం పట్టణంలోని సగంమందికి పయిఃగా భగవతమ్మ మతంలో కలిశారు."

"అది వాళ్ళఖర్మం- నా కిష్టంలేదు. నేను కలవను. నీకు నచ్చి నప్పుడు ను వ్వాభగవతమ్మచేత ఉపదేశాలూ పొందొచ్చు, ఆమతం లోనూ కలవ్వొచ్చు. నేను అడ్డుపెట్టడం లేదుగా."

"మీా రడ్డుపెడితే మాత్రం ఆగుతుందా యేమిటిగాని మన మతాలు వేరయినప్పుడు మనంకూడా విడిపోవలసి వస్తుంది."

"అయితే- నీయిష్టం-యిక నే నే మీాచెప్పలేను."

అని భార్యాభర్తలయిన గోరాభవానులు తర్కంపడుతూ వున్న సమయంలో గోరాతమ్ముడు ఏకనాథుడు వాళ్ళింటికి కొచ్చాడు. అతన్ని చూడగానే భవాని మరింత దుఃఖం ముసుకుకొంది. ఆమె యొక్క తీవ్రభావాన్ని చూసి, గోరాకూడా జంకాడు, తమ్ముడితో మాటలాడ డానికి.

అందువల్ల ఏకనాథుడే అన్నగార్ని పలకరించాడు.

"అలా కూర్చున్నారేం అన్నయ్యా?"

"ఏమీాలేదు."

అని గోరా తమ్ముడికి సమాధానం చెబుతుండగా-

"నీ కెక్కడయినా పనిదొరికిందా ఏకనాథ్?" అని భవాని అడిగింది.

"ఎక్కడా దొరకలేదొదినా? ప్రయత్నం చేస్తున్నాను."

"ప్రపంచకంలో యెవరికయినా పని దొరుకుతుందిగాని, నీకు మాత్రం దొరకదు—ఇక్కడేదోపాసి పోతూవున్నట్లుగా, విశాఖపట్నం నుంచి పరుగెత్తుకొచ్చావు."

"అక్కడ చాలారోజులు యిబ్బందిపడ్డాను. రంగం వెడితే పను లు దొరుకుతాయని చాలామంది చెప్పారు. పనిదొరికినా దొరక్క పోయినా, నాకు కావలసిన బంధువులంతా యిక్కడ వున్నారుగదా అనివచ్చా వొదినా!"

"మహాగొప్పపని చేశావులే. బంధువు లుంటే మాత్రం వాళ్లే మయినా, యిక్కడ నీకోసం పోగేసుకుర్చున్నారా యేమిటి? ఈకరువు రోజుల్లో ఒకరి నొకరు పోషించడం చాలా కష్టం—"

అని ఒదినగారంటూ వున్నదానికి, ఏమీ సమాధానం చెప్పకుండా చిన్నబోయిన ముఖంతో నిలుచున్నాడు ఏకనాథ్. గోరాకూడా ఏమీ కలుగజేసుకోలేదు. ఏకనాథ్‌కు మైనారిటి వొదిలి అంతా రెండు మాసాలయింది. అంతకు ముందునుంచీ కూడా అతను విశాఖపట్నంలో వుంటూ, పనికోసం ప్రయత్నంచేస్తున్నాడు. కాని అతని కక్కడఏమీ లాభం లేకపోయింది. స్కూలుఫయినలువరకూ, ఆస్నేహితునిసాయం వల్లా, ఈస్నేహితుని సాయంవల్లా చదువుకన్నాడంతేగాని, అతనికి అన్నగారివల్లగాని, యితర ఆత్మీయులవల్లగాని, ఎటువంటి సాయము న్నూ జరుగలేదు.

తలిదండ్రులు బ్రతికివున్నప్పుడు గోరా తమ్ముని కొంచెం దయగా చూసేవాడు. కాని వారు పోవడము, భార్య కాపరానికి రావడము జరగ్గానే, అతనికి తమ్ముని పూసు అవసరం లేకపోయింది.

స్నేహితుల సాయంవల్ల కొంతవరకూ చదువుకొన్న అనంతరం ఏమిచెయ్యాలో ఏకనాథ్‌కు బోధపడలేదు. రంగం వెడితే, అక్కడేమయినా ఉద్యోగం దొరుకుతుందనికూడా అతనిస్నేహితులే సలహా చెప్పి, అతని దారిఖర్చులకూడా పైకమిచ్చి పంపారు. ఒకవేళ కొంతకాలం ఉద్యోగం దొరక్క పోయినప్పటికీ అన్నగారియింట్లో కాలక్షేపము చెయ్యొచ్చునుగదా యని వారాలోచించారు.

ఏకనాథ్ విశాఖపట్నం నుంచి, రంగం చేరుకొని ఆరుమాసాలయింది. ఈ ఆరుమాసాలనుంచీ అతను అక్కడ నానా అవస్థలూ పడుతున్నాడు. అన్నగారివల్లగాని, యితర బంధువులవల్లగాని, అతని కెటువంటి వుపకారమున్నూ జరగలేదు. అతని కొక్కపూట భోజనం పెట్టడానికి కూడా ఎవరికీ దయ కలుగలేదు.

ఆపాపులలోనూ, యీపాపులలోనూ ఉత్తరాలు రాసి, రూపాయి, అర్థ సంపాదించినప్పటికీ, మధ్యమధ్య వరసగా నాలుగేసి

రోజులు పస్తులు పడివుండడం అతనికి తప్పడంలేదు. కట్టుకోవడానికి బట్టలు లేవు. తినడానికి తిండిలేదు. ఇటువంటి దీనదశలో అన్నగారి వల్ల ఏమయినా సాయంకలుగుతుందేమో నని, అత డొచ్చాడు. అతని మాసిన బట్టలు- రోడ్డుదుమ్ముతో నిండిన జుట్టును చూచి, ఒదినగారు మొదటనే అసహ్యించుకొంది.

గోరా, రంగంలో ఒక ఓడల కంపెనీలో పనిచేస్తున్నాడు. నెల కో వందరూపాయిల జీతమును తెచ్చుకుంటున్నాడు. అతడు స్వతహా లోభి - ఆత్మీయులయెడల అభిమానం లేనివాడు. దానికితోడు భార్యకు పూర్తిగా వశుడు కావడంలో, పూర్తిగా అస్వతంత్రుడు కూడా అయివున్నాడు. ఇంటికి వచ్చిన తమ్ముణ్ణి మనసారా పలకరించి కూర్చోమనడానికయినా అతనికి స్వతంత్రం లేకపోయింది.

"అన్నయ్యా! నాలుగురోజులనుంచి, చేతిలో కానిడబ్బయినా లేదు——అందువల్ల పస్తులు పడివుండవలసి వచ్చింది.

అని ఏకనాధ్ తనంతట తానే అన్నగారితో చెప్పుకున్నాడు. అత నేమీ మాటలాడలేదు.

"అందరిపనీ అలాగేవుంది. కరువురోజుల్లో, ఒకరిపై ఆధారపడి లాభంలేదు——ఏ కూలోనాలో చేసుకొని బ్రతకాలంతేగాని, అన్నయ్యతో చెప్పుకొంటే యేంలాభం?"

అని భవానీ తీక్షణంగాఅంది, ఆమె అలా చెబుతుందని ఏకనాధ్ కు అంతకుముందే తెలియకపోలేదు. అయినప్పటికి అన్నగారి కేమయినా దయకలుగుతుందేమో, కొన్ని కాపూటభోజన మైనా దొరుకుతుందేమోనని అతడు వచ్చాడు. కాని, అప్పుడన్నగారి పలుకే బంగారమైపోయింది. కొంతసేపటివరకూ యెవరూ మాటలాడలేదు.

"అన్నం ముంటే, పెట్టి పంపించు"

అనిమాత్రం గోరా కొసనాలికతో అన్నాడు"

"అటువంటిదుంటే, మీరు చెప్పనవసరంలేదు. నేనే ముందుగా అతన్ని భోజనానికి లేవమని చెప్పివుందును. ఈ పూట్లో మేనమామ వగైరా బంధువులంతా వున్నారుగా. అక్కడకు వెడతాడులెండి"

అనిభవాని చెప్పడంలోనే, గోరా యిహానేమీ మాటాడలేదు. ఆత్మాభిమానంగల ఏకనాథ్‌కు అంతకంటే యింకేంగావాలి? ఇహ జన్మలో వారిగుమ్మమయినా తొక్కకూడదని - అతడు తనలో తాను ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. నెలకు వందరూపాయలు జీతం తెచ్చుకుంటూ తన కొక్కపూట భోజనం పెట్టలేని అన్నగారి దుస్థితికి విచారించాడు. తిండి లేక పోతే మలమల మాడిచచ్చి పోవడమయినా మంచిది కాని బంధువుల యిళ్ళకు వెళ్ళి వారిచేత అవమానింప బడడం కూడదని అని అతడు నిర్ధారణచేసుకున్నాడు.

మేనమామ వగైరా బంధువుల యిళ్ళ కింతకుముందు వెళ్ళడము - వారిచేత కూడా యిదేవిధంగా అనాదరణ చేయబడడము యింతకు ముందే జరిగింది. అందువల్ల అత డాక్షణంలోనే మనసును విరక్తి చేసుకొని ఎవరితోనూ చెప్పనయినా చెప్పకుండా చక్కాపోయాడు. అతడు వెళ్ళిపోయిన అనంతరం—

"మాటిమాటికీ మన యింటి మీదికి వచ్చిపడుతూ వుంటాడు. అతని అభిప్రాయ మేమిటో?" అని భవాని అడగ్గా—

"అందుకు మనమూ తగినట్లే చేశాముగా?"

అని భర్త అనడంతోనే ఆమె తృప్తిపడింది.

"సరే! నేను మఠంలోకి వెడుతున్నాను. మీ రెక్కడికయినా వెడితే తలుపు తాళం వెయ్యండి! నాదగ్గిర యింకొక తాళం చెవి వుంది—"

అని భర్తతో చెప్పి భవాని మామూలుగా భగవతి మఠంలోకి చక్కాపోయింది.

## 3

ఆది భగవతమ్మగారి సమాజం—

సుమారొక నాలు గయిదు ఫర్లాంగులమేర పందిళ్లు వేయబడి వుంటాయి. ఆపందిళ్లనిండా మామిడాకుల తోరణాలు, రంగురంగుల కాగిత పువ్వులు - పెద్దపెద్దపటాలు - అలంకరించబడి వుంటాయి.

ఆ పందిరిలోనే ఒక చోట బ్రహ్మాండమయిన మందిరం యేర్పాటు చేయబడి వుంటుంది.

ఆమె స్త్రీ లోకాని కంతటికీ గురుదేవి. బాలాదివృద్ధుల వరకూ గల స్త్రీలందరూ అక్కడ యిసుక వేస్తే రాలకుండా వున్నారు. ఇంకా అనేకమంది స్త్రీలు గురుదేవికి కానుకలు, కాన్కలు పట్టించుకొని వస్తూ వున్నారు.

విలువగలచీరలు కట్టుకొని తలనిండా పువ్వులు పెట్టుకొని, ముస్తాబులై వచ్చిన అంతటి స్త్రీజనసమూహంలోనూ, మచ్చుకయినా ఒక్క మొగపురుగు లేకపోవడ మొకవిశేషం. వేలసంఖ్యకు పైబడివున్న ఆ స్త్రీలందరూ భగవతమ్మకు సాష్టాంగనమస్కారములు చేయడము - ఆమెకు హారతులు పట్టడము, మొదలయిన కార్యాలలో కొంతసేపు నిమగ్నులయిన అనంతర మాభగవతమ్మ తనయొక్క బోధనామృత వాక్యాలను ప్రారంభించింది. అంతటా నిశ్శబ్దమయింది.

"సోదరీ మణులారా !

మీ రందరూ నామతమునందును, నాబోధయందును, గౌరవ విశ్వాసము లుంచి, నాకు శిష్యులయినందుకు నే నపరిమితానందము ననుభవిస్తున్నాను—

స్త్రీలకు నిగ్రహం చాలా అవసరం. అది కలిగినవారికి పురుష జాతితో యెక్కువసంబంధ ముండదు. అప్పుడు మనము పురుషులకంటే, అధికప్రతాపం గలవారమై, ఆజాతిని జయించినవార మగుదుము. స్త్రీలు అంతఃపాతాళంలోకి క్రిందకు దిగదీయ బడడానికి పురుషులే ముఖ్య కారకులు. కనుక మీ రందరునూ వారి కెంతదూరంగా వుంటే అంత మంచిది.

తరువాత-సామాన్య ప్రజలు ఊహించుకొనే మోక్షంకంటే, అధికమయినది మరియొకటి యున్నది. అట్టి దానిని పొందుటకే మీ రెల్లరునూ ప్రయత్నించవలెను. అది యెలా సాధ్యమవుతుం దనగా గురుదేవిగారివలన వుపదేశమును పొంది, ఆ మతమును పఠించ వలయును.

దీక్షను కలిగి 'భగవతి' నామమును జపించుచు కళ్లు మూసు కొన్ని యెడల పవిత్రమయిన హృదయం గలవారికి సాక్షాత్తూ భగవంతుడే అవుపించి మీరు కోరిన వరములు ప్రసాదించగలడు.

కనుక ఒక్కసారి—

"శ్రీ భగవతి - శ్రీభగవతి"—జపించండి.

మరునిమిషంలో ఆపందిరి - చుట్టు ప్రక్కల మందిరములు భగవతినామ స్మరణతో ప్రతిధ్వనించాయి. అంతటా కోలాహలం— ఉద్రేకం- ఉత్సాహం. ఆవిధంగా భగవతి నామమును జపిస్తున్నా వారిలో భగవంతు డెవరికి కనుపించాడో - ఎవరికి కనుపించ లేదో ఎవరికి తెలుసు? ఎవరు చెప్పకొంటారు?

"పవిత్రత లేనివారికి భగవద్దర్శనము గాదు!!"

ఇది భగవతివాక్యం—

అది మధ్యాహ్నం రెండుగంటలవేళ. ఎండతీవ్రతకు ఆ యింటి మీదికాకి ఈ యింటిమీదికి వాలడంలేదు. వైశాఖ మాసపు ఎండ గాడ్పులు ఈ చెంపనుంచి ఆ చెంపకు కొడుతున్నాయి.

ఏకనాథ్ అంతవరకూ యెక్కడెక్కడో తిరిగాడు. ఒంటిని పట్టిన చెమటలు ప్రవాహరూపం దాల్చాయి. కాళ్ళన్నీ బొబ్బలెక్కి వున్నా యిప్పు డతనికి.

ఒకచోట భజనలు మరియొకచోట ఉపన్యాసములూ జరుగు తున్న ఆ పందిరిలో కొంచెం విశ్రాంతి తీసుకుందామని వచ్చాడు. ఆ అట్టహాసమంతా చూస్తే అక్కడ యేదో శుభకార్యం జరుగుతుం దేమోనని తనకు పట్టెడు మెతుకు లాపూట అక్కడ దొరుకుతా యేమో నని ఆశపడ్డాడు.

"ఉస్" అంటూ ఆపందిరిలో ఒకమూల కూలబడ్డాడు. ఇంతలోనే కొంపములిగి పోయిన ట్లెవరో యిద్దరు స్త్రీలు వచ్చి—

"ఏమయ్యోయ్! లేలే! నీకు బుద్ధిలేదూ? ఇది స్త్రీలసమాజం? మొగవా ళ్ళిక్కడకు రాకూడదు—"

అని గద్దించి పలుకడంతోనే ఏకనాథ్ నిరాశతో ఒకనిట్టూర్పు విడిచి మెల్లిగా లేచాడు. తేలిపోతున్న అడుగులతో ఆ పందిరిని దాటాడు. లోపలక్షుద్బాధ! పయిన మొండబాధ! ఎక్కడికి వెళ్ళడం? ఏమి చెయ్యడం?

"అయ్యో! భగవంతుడా! ఇటువంటి గర్భదరిద్రుణ్ణి బ్రతికించి ఏం ప్రయోజనం! ఇంకా యెన్ని బాధలు పెట్టతల్చుకున్నావు తండ్రీ! నువ్వుతల్చుకుంటే నిమిషం పట్టదు, ఈజీవనాలు గాలిలో తేలిపోవడానికి. అవును నే ననుభవించవలసిన దుష్కృత మింకాయెంతో వుండగా, నువ్వలా యెందుకు చేస్తావు? ఎంతకాల మీదురవస్థను అనుభవించాలో, అంతకాలమూ అనుభవించాలి"

అని అతడు తనలో దుఃఖపడుతూ, మరికొంతదూర మలాగే లేనిఓపిక తెచ్చుకొని నడిచాడు. ఒక గమ్యస్థానం చేరుకొంటే తన బాధ నివారణ అవుతుందన్న ఆశ అతనికి లేదు గదా? ఒకవయిపున నాలుక తడారిపోతూవుంది. అత డిక నడవలేకపోయాడు. మిషన్ హాస్పటలుకు చేరువలో ఒకచిన్న కుటీరందగ్గర పడిపోయాడు. స్పృహ లేదు.

అది అతనితోబుట్టు వున్నస్థలం. ఆత్మబంధువు లందరూ వున్నవారూ. అయితే యెందుకూ? ఈతడు నిర్ధనుడు. బికారి. ఉద్యోగం లేని వాడు. అందువల్ల అందరకూ యీతనియందు నిరాదరణభావమే. ఒక్కరూ అతనికి పట్టెడన్నమును పెట్టలేకపోయినారు. వేలకువేలు కానుకల నాభగవతికి సమర్పించి, మతవ్యామోహంలో పడిపోయిన ఆ స్త్రీ లతని కాచల్లని పందిరిలో క్షణకాలం నిలుచోవడానికయినా ఆస్కార మిచ్చారు కారు.

వారు బిడ్డలగన్నతల్లులే—!

అయితే యెందుకూ? కష్టమును జీర్ణించుకొన్న గృహిణులే!. ఏమిలాభం? ఆకలిమంటతో అల్లాడిపోయే, అతనికి గుక్కెడు మంచి నీళ్ళియలేనిమత మెందుకు? వడగొట్టి శోషిల్లిన ఆ దీనుడికి గోరంతచో

టీయులేని వారిదీక్ష లెందుకు? భజనలు దేనికి? వాటివల్ల ఏదేవుడు తృప్తిపడతాడు? ఏదేవత ఆనందిస్తుంది?

ఇది నేటిమానవతత్వం!— నేటి మతం!

౪

హాస్పటలులో ఆనాటిపనిరద్దీవల్ల మధ్యాహ్నం భోజనానికి, జ్యోతి చాలా ఆలస్యంగా వచ్చింది. వచ్చీరావడంతోనే తనగుమ్మంలో స్పృహలేకుండా పడివున్నయువకుణ్ణి చూసింది.

"అయ్యో! పాపం! ఇత నెవరబ్బా!"

అని తనలో, అనుకొని, ఆదుర్దాతో ఒళ్లంతా తాకిచూసింది. నిస్త్రాణవల్ల, పడిపోయివుంటాడని వూహించుకొంది. వెంటనే లోపలకు వెళ్లి, చన్నీళ్లు తీసుకొచ్చి అతనిముఖంమీద చిలికింది. గొంతుకలోకూడా కొన్ని నీళ్లు పోయగా, అతడు వాటిని మింగాడు.

జ్యోతి, అతన్ని మెల్లగా లోపలకు తీసుకెళ్లి, మంచంమీద పరుండజేసి, మరికొంతసేపు శైత్యోపచారాలు చెయ్యగా అతడు కళ్లు విప్పి, తన కెదురుగా తెల్లటిదుస్తులు ధరించివున్న సుందరాంగిని తిలకించి; రెండుచేతులూ యెత్తి ఆమెకు నమస్కారం చేయబోయాడు కాని అప్పు డతని కంతటిశక్తి లేకపోయింది. అతడు లేవబోయి, తిరిగి పడుకున్నాడు.

"మీ రిప్పుడు చాలా నీరసంగా వున్నారు. కళ్లుమూసుకుని పడుకో!" అని ఆమె అన్న మధురవాక్కు లతనికి నూతనజవమును చేకూర్చాయి. కాని అత నేమీ మాటలాడలేదు. ఆమెవయిపు రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

"కొంచెం పండ్లరసం తాగుతావా?" అని ఆమె అనురాగంతో అడగ్గా, అతడు తాగుతా నన్నట్లుగా తలనూపాడు. జ్యోతి వెంటనే అలమారాతీసి, అందులో వున్న నాలుగునారింజపండ్ల నొకగాజుగ్లాసులో రసంతీసి, అతనిచేత తాగించింది. అనంతరమతనికి మరింత బలం కలిగింది.

"నీవు వచ్చిన దగ్గరనుండి నీ హృదయంకూడా నిర్మలమైపోతున్నట్లుంది. నీ వెవరవు? నన్ను అపాయస్థితిలోనుంచి రక్షించి ఎందుకు బ్రతికించావు? నువ్విలా చెయ్యకపోయినట్లయితే, నా సర్వకష్టాలూ అంతటితో అంతమైపోయేవి గదా!"

అని అతడు క్షీణస్వరముతో అంటున్న మాటలు విని జ్యోతి తెల్లబోయింది.

"ఈ వయస్సులో నీ కిటువంటి నిస్పృహ ఎందుకు కలగాలి?"

అని ఆమె అడగ్గా, ఏకనాథ్ ఏమీ మాటలాడలేదు. ఒక నిట్టూర్పును విడిచాడు.

"మలినమైవున్న నీ దుస్తులనుబట్టీ, నీ వాలకమునుబట్టీ, నువ్వొక నిరుపేదవని తెలుస్తుంది. అయినప్పటికీ, నువ్వొక ఉత్తమ కులంలోని విద్యార్థివని నీ ముఖలక్షణాలు చెబుతున్నాయి."

తనయొక్క దరిద్రస్థితి నంతటినీ ఆమెతో చెప్పడానికి అతడిష్టపడ లేదు.

"ఇక వెళ్ళిపోతా! నీ ఉపకారాన్ని ఎప్పటికీ మరచిపోను"

అని చెప్పి అతడు మంచంమీదనుంచి లేవబోతూవుంటే ఆమె వారించింది.

"తొందర లేదు- ఇప్పు డెక్కడికి పోతావు? కొంచెంసేపు విశ్రమించు." అని ఆమె నిర్బంధం చెయ్యడంవల్ల అత డేమీ మాటాడ లేకపోయినాడు.

"భోజనం చేస్తారా?"

అని ఆమె అతనిని అప్రయత్నంగా అడిగింది.

"భోజనం!" అని అత డాశ్చర్యంతో అడిగాడు.

"అవును. భోజనం చేస్తే నీ కింకా బాగుంటుంది. నాకు హోటలునుంచి భోజనం వస్తుంది. అభ్యంతరం లేకపోతే—"

"అభ్యంతరం! నేను భోజనంచేసి నాలుగురోజు లయింది. అందుకే యిలా శోష వచ్చింది కూడాను. పుణ్యాత్మురాలవయిన నువ్వన్నం పెడతా నంటే నేను వద్దంటానా?

అని ఏకనాథ్ అనడంవల్ల ఆమె అతని ఆకలిబాధను గుర్తించింది. వెంటనే ఒకబల్లమీద అతనికి భోజనమును ఏర్పాటు చేసింది. అత డాదుర్దాతో లేచి కడుపునిండా భోజనం చేశాడు. అంతవరకూ అతను పొందిన ఆకలి బాధను చూసి ఆమె తెల్ల బోయింది.

"నాగంపెడాకలి నీవు పోగొట్టావు. నీఋణము నెలా తీర్చుకోవాలో నాకు తెలియడం లేదు."

అని అత డన్నదాని కామె తనలో తాను నవ్వుకొని—"నేను కూడా భోజనం చేస్తా" అని అతడు తినగా మిగిలిన దానిని తాను తింటూవుండగా అత డామె చేరువలో కూర్చున్నాడు.

"మీ దేవూరు?" అని ఆమె భోజనం చేస్తూ అడిగింది.

"మాది అసలు విశాఖపట్నం. అంతా ఒక సంవత్సరంక్రితం యిక్కడ ఏదయినాపని దొరుకుతుందేమోనని వచ్చాను. కాని యింత వరకూ యేపనీ దొరక్కపోవడం వల్లనే యిలా తిండయినా లేకుండా అవస్థలు పడుతున్నాను."

"అయ్యో! పాపం! నీకు ఎవరూ లేరా?"

"అందరూ వున్నారు. ఈ వూళ్లోనే అన్నగా రున్నాడు. ఆత్మ బంధువులున్నారు. అయితే వారివల్లనా కెటువంటి సాయమూజరుగదు"

"కొంతవరకూ చదువుకొన్న వాడిలా వున్నావే!"

"నువ్వూహించిన దాంట్లో పొరపా టేమీ లేదు. స్కూలు ఫయినలుదాకా చదువుకన్నాను—"

"నీపేరు?"

"ఏకనాథ్"

"ఏకులం?"

"బ్రాహ్మలం"

అని అతను చెప్పగా జ్యోతి నాలుక కరుచుకొంది.

"నేను చాలా తప్పుచేశాను."

"ఏం?"

"మీరు బ్రాహ్మణు లనుకోలేదు"

"అనుకోకపోతే యేం?"

"మీలాంటి ఉత్తమకులస్థులచేత నాచేతి భోజనము తినిపించి మహాపాతకురాల నయ్యాను—"

"మీ రెవరు?"

"క్రైస్తవులం"

ఏకనాథ్ క్షణకాలం ఆలోచించాడు.

"నీపేరు?"

"జ్యోతి"

"జ్యోతీ! నువ్వు గావించినది మహాపుణ్యం. ఒక దీనుడు ప్రాణా వశిష్టుడై వుంటే అతన్ని ఆదరించి పట్టెడన్నమును పెట్టావు. ఉత్తమ కులీనులమనుకొనే వారి కేమాత్రం దయ లేకపోయింది. వారి ఆత్మలు కఠిన పాషాణాలతో నిర్మించబడ్డాయి. నాజీవితంలో జరిగిన ఒక్కొక్క ఘట్టమే తల్చుకొంటూ వుంటే నాగుండె బ్రద్దలయి పోతుంది. మానవత్వం లేక పోయినాక ఏకులమయితే యెందుకు? ఏమత మయితే యెందుకు?"

అని ఏకనాథ్ చెబుతుంటే విని భోజనం చేస్తున్న జ్యోతి ఆశ్చర్య పోయింది. అతని హృదయం అంత విశాలమయినదా అనుకొంది. అతనికి కలిగిన కష్టముల వల్లనో కులస్థులు ఆత్మీయులూ చేసిన అనాదరణ వల్లనో అతని హృదయానికి అటువంటి పవిత్రత కలిగి వుంటుం దనుకొంది.

ఏకనాథ్ తిరిగి చెబుతున్నాడు.

"నువ్విప్పు డొక దేవీమూర్తివై నన్ను రక్షించావు. నీకుల మేదయినా నిన్నారాధించు కోవడం నాకు కర్తవ్యం"

"అటువంటి మాట లనకూడదు."

"జ్యోతీ! నీలోని ఏమహత్తర దివ్యతేజస్సునో నేను చూడగలుగు తున్నాను. ఆ దివ్యతేజోమూర్తిని ఆరాధించు కోవడానికి నా కనుమతించా వంటే నేను ధన్యుణ్ణవుతాను."

అతని ఉద్రేకపూరితా లయిన వాక్యాలను జ్యోతి అర్థంచేసుకో లేకపోయింది. ఇంతలో ఆమె భోజనమయింది.

"నీ కెక్కడో పనల్లే కనిపిస్తుంది?"

"అవును—హాస్పటలులో నర్సును."

"ఈ వూరేనా?"

కాదు—కాకినాడమిషనునుంచి వచ్చాను."

"ఇప్పుడు తిరిగి హాస్పటలుకు వెళ్ళిపోతావా?"

"లేదు. ఈమధ్యాహ్నం నాకు డ్యూటీలేదు. తిరిగి రాత్రి వెళ్లాలి."

"మంచిది. నీ మేలును మరచిపోలేను. నా ఆకలిమంటను చల్లార్చి పుణ్యము కట్టుకొన్నావు. వెళ్లిపోతా"

అని అతడు లేచాడు.

"ఎక్కడకు వెడతావు? ఆదరించేవాళ్ళెవరూ లేరని చెప్పావుగా?"

"లేకపోతే ఏంచెయ్యను? ఎక్కడికో పోతాను."

"ఏకనాథ్! నువ్వు నాదగ్గర కొంతకాల ముండరాదూ? నీ నిస్సహాయస్థితిని చూస్తే నాకు చాలా జాలవుతూంది. నా కులగోత్రాలను నువ్వుపాటించనివాడవని తెలియడంవల్ల యిలాఅంటున్నాను."

అని జ్యోతి చెబుతుంటే ఏకనాథ్ ఆమె మెత్తని కళ్ళవయిపొక సారి దీక్షగా చూసాడు.

"ఏకనాథ్! అలా చూస్తా వెందుకు?"

"జ్యోతీ! ఇటువంటిబిచ్చగాణ్ణి ఇంతగా దయదలుస్తున్నా వెందుకూ?"

"దయ— అది మా ఉద్యోగాలలో నేర్పినవిద్య. దయగలవారిని తాను దయగా చూస్తానని మా ఏసుప్రభువు ప్రతిజ్ఞ—"

"ఆహా! అది మతము - అది మానవత్వము."

"ఏ దేవుడయినా, ఏ మతమైనా అవే వాక్యాలనే చెబుతాడు. ఆయా జాతిభేదాలలో పెట్టినవారే మానవులు [illegible]"

"జ్యోతి! నీరూపం [illegible]"

"అయితే, నాతో కొంతకాలం గడపడానికి అంగీకరించినట్లేగా?"

"సంతోషంతో!"

ఆమాటతో జ్యోతిహృదయం తృప్తిపడింది. విశ్రాంతి తీసుకోవడాని కామె అతనికి పక్క అమర్చింది.

౩

"ఇప్పటింతకూ యీ భగవతమ్మమతం నాప్రాణాని కొచ్చింది తప్ప యింకేమీ లేదు. అవతల ఆఫీసుపనే చూసుకోనా? అమ్మగారు మతానికి తయచేస్తే యింటిపనులే చక్కబెట్టనా?

'భగవతమ్మ గొప్పది- గొప్పదని, ఈ ఆడాళ్లందరూ మతులు పోగొట్టుకోవడమేగాని ఆవిడలో వుండే మత మేమిటో అర్థంగాదు. భవాని అసలే మూర్ఖురాలు! తా నా మత వ్యామోహంలో పడిపోవడమేగాకుండా కొంతకాలం నన్ను కూడా బాధపెట్టిం దామతంలో కలవమని.

దానిధర్మమా అని యీమధ్య నన్ను బాధపెట్టడం మానేసింది. బాగానేవుంది గాని తా నీవిధంగా ఇల్లుపట్టకుండా అహర్నిశలు ఆమతాన్ని పట్టుకు యేడుస్తే యెలా సాగుతుంది? ఇదిగో యిప్పుడు ఎనిమిది గంటలరాత్రియింది. పగలస్తమానం ఆఫీసు నౌకరీకోసం రెక్కలు కొట్టుకొట్టుకొని యిల్లుచేరుకుంటే యేముంది? వంటాలేదు-పెంటా లేదు.

ఆవిడగారెప్పుడు వస్తుందో ఎప్పుడు వంటచేస్తుందో! తీరా వచ్చాక గజ్జలగుఱ్ఱంలాగున తందనా లాడుతుంది. "నేను వచ్చేదాకా యెందుకూర్చున్నారు? మీ రయినా కొంచెం వంట ప్రయత్నం చేయలేక పోయారా?" అని అడుగుతుంది. ఆవిడగారి మోతుబరీ యేమిటో నా కర్థంగాదు. పగలస్తమానమూ రెక్కలు కొట్టుకొన్నదే గాకుండా యింటికొచ్చి వంటకూడా యెక్కడేడవనూ? తలుపు తాళం వేసి మొలలో యింకో తాళంచెవి వేసి బయలుదేరుతుంది. రాత్రింబగళ్లాగురుదేవిదగ్గరే కాపరం. ఈవేళ ఏమయినాసరే ఏపని ముట్టు

"సరి యింకేం! తేలిపోయింది వ్యవహారం! ఇంద్రియనిగ్రహం కావాలని పదిమందికీ ఉపదేశంచేస్తూ, ఆమహనీయురాలు ఇంద్రియ పుష్టికి సాధకాలు చేస్తూ వుందన్నమాట!"

అని గోరా చెబుతుంటె, కామయ్య న వ్యాపుకోలేక విరగ బడి నవ్వడం మొదలు పెట్టాడు.

"నామాట యథార్థం—నమ్మండి."

"నిజమేనండీ! దేశాలు తిరిగినవారు గాబట్టి, మీరు విషయ మును గమనించారు."

"ఆదిలోనే గ్రహించినాను. అయితే ఆడవాళ్లు ఏమనుకుంటారని ఏమీ అనను. అప్పటికీ భగవత్సన్నిధిని హేళన చేస్తున్నానని మధ్య మధ్య మా ఆవిడ మూతి విరుస్తూనే వుంటుంది."

"ఇంతకూ, మనలో చేవ లేకపోబట్టి, ఆడవాళ్లు యిష్టమొచ్చి నట్లుగా సంచరిస్తున్నారు. నే నిలా అన్నానని కోప్పడకు గోరా బాబూ!"

"ఇది ఆడవాళ్ళ రాజ్యం కామయ్యపంతులుగారూ! మీకు తెలియని దేమున్నదీ?"

"మనం ఆడవాళ్ళమై కూర్చుంటే, ఆడవాళ్లదే రాజ్య మవు తుంది. ఎందుకనామా? మీ యావిడ వెళుతూవుందని, మాయా విడ - మాయావిడ వెళుతూ వుందని యింకొకావిడ - యిలాగ్గా ఒకర్ని చూసి ఒకరు చెడిపోతున్నారు. ఇంతవరకూ మాయావిడ, ఆ గురు దేవికి నాలుగువందల రూపాయలవరకూ దక్షిణచుకొంది. ఈ కరువు రోజుల్లో, నాలుగువందలు కాదుగదా, నాలుగు రాగిపైసలను మన కెవరూ ఈయరు. ఎవరితోనయినా చెప్పుకుంటే సిగ్గుకూడాను."

"సిగ్గుపడ నక్కరలేదు. రెండు మూడు వందలవరకూ మా ఆవిడకూడా గురుదేవికి సమర్పించుకొన్నది."

"రామ రామ! ఈపద్ధతిలో ఈఆడాళ్లతో మనం యెలాగండీ వేగడం?

"ఏంచెయ్యమంటారో చెప్పండి కామయ్యగారు! మీరేమి చేయమంటే అలాచేస్తాను. నేను మాత్రం యీ ఆడవాళ్ళతో సుఖపడుతున్నానా?"

"చేస్తారా?"

"తప్పకుండా చేస్తా"

"మన మేలాగయినా, భగవతమ్మ చుట్టూ మూగే ఆడమళయాళాన్ని చెదరగొట్టాలి —"

"అదే యెలాగో అర్థం గాదు."

"ముందుగా ఆగురుదేవిని హైరెక్కిస్తే అందరి రోగమూ నెమ్మదిగా కుదురుతుంది"

"మనఆడవాళ్ళను మనము అదుపులో పెట్టుకోలేకుండా వున్నాను గాని, భగవతమ్మను హైరెక్కిస్తాము!"

అప్పటికి సుమారు రాత్రి పదిగంటలు అయింది. అప్పుడు భవాని కామయ్యగారిభార్యా కలసివచ్చారు. వారిని చూడగానే భర్తలిద్దరూ కూడా ఉగ్రులైపోయారు.

"పదిగంటలు రాత్రి అయిందిగదా, ఇంతవరకు మీరు ఇంటికి చేరుకోకపోతే యెలా గనుకున్నారు?" అని, గోరా భార్యను తీక్షణంగా అడిగాడు.

"ఒకరోజున కాస్త ఆలస్యమయితే, కొంపమునిగిపోయిందా యేమిటి? అనిభవానికూడా తీక్షణంగానే అడిగింది.

"ఇంతవరకూ అక్కడ వెలిగిస్తూవున్న రాచకార్యా లేమిటంట? ఇక వంట లెప్పుడవుతాయి? భోజనా లెప్పుడవుతాయి?"

"అయినప్పుడే అవుతాయి" అని భవాని భర్తకు చెప్పే సమాధానం వింటూవుంటే కామయ్యకసహితం ఒళ్లు మండిపోయింది.

"ఇదుగో! ఈరోజుమొదలుకొని, నువ్వా భగవతమ్మమఠంలోకి వెళ్లావంటే, వీపు చీరేస్తా. ఈభవానమ్మ, తా చెడడమేగాకుండా ఆడవాళ్ల నందర్నూ పాడుజేస్తూంది. ఇంకా యింటిక్కి నడవ్వేం?" అని కామయ్య భార్యవైపు గుడ్లెర్రజేసి గద్దించేటప్పటికి అత డప్పుడు

నిజంగా కొడతాడేమోనని ఆమె భయపడింది. అందువల్ల కిక్కురు మనకుండా భర్త వెనకాల ఝంటిముఖం పట్టింది.

"నీకు చెప్పేమాట కూడా అదే!" అని గోరా భార్యతో అన్నాడు. కాని ఆమె మాటలాడ లేదు.

౬

"జ్యోతీ! నే నెంతో కాలంనుంచి తిండికి మొహం వాచాను- గుడ్డకు కరువు పడ్డాను. ను వ్వాశ్రియ మిచ్చినప్పటినుంచీ కడుపునిండా తిండీ ఒంటినిండా బట్టా కలుగుతూ వుంది. కాని, నీ ఋణం మెలాగున తీర్చుకోవాలనో తెలియకుండా వుంది"

"అటువంటి మాట లెందుకులే యేకనాథ్! నెలనెలా అరవై రూపాయలు వస్తాయి. నాకు మాత్రం తినడాని కెవ రున్నారు?"

"అలాగునని కష్టార్జితము నొకరికోసం మెవరు వినియోగించ గలరు జ్యోతీ!"

"నేను కష్టపడుతున్నది డబ్బుకోసమే అయినట్లయితే నువ్వు చెప్పినది యథార్థమే అవుతుంది. కాని, నా ఆశయం ధనార్జన కాదు."

"మరేమిటి జ్యోతీ!" అని యేకనాథ్ ఆమె మొతీనేకళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

"నన్ను పోషించిన మిషన్, నన్ను పెంచి పెద్దదానినిగా చేసిన మిషన్ నా కీకార్యాన్ని వినియోగించింది. రోగులను కన్నబిడ్డలుగా యెంచి సేవ చెయ్య వలసినదిగా ఆదేశించింది. ప్రజాసేవ నాజీవితానికి పరమావధి-నాహృదయాని కానందం. ఆపన్నులకు సేవచెయ్యడంలో వారికొరకు నాద్రవ్యమును ఖర్చు పెట్టడంలో నాకు సంతోష ముంది. నువ్వు ఆకలిదప్పులవల్ల శోషిల్లి నాగృహప్రాంగణంలో పడి వున్న ఆపన్నుడవు. నిన్ను రక్షించి పోషించడం కంటే నాకు వేరు సేవాఫలితం లేదు. అది మా ప్రభువు ఆజ్ఞ!"

"జ్యోతీ! అయితే నా ఆపద గడచిందిగదా, నా దారిని నన్ను పొమ్మని చెప్పరాదా! న న్నిలా యెంత కాలమని పోషించ గలవు?"

"నాపోషణలో వుండడం నీకు బాధగా వుందా ఏకనాధ్!"

"అటువంటి అభిప్రాయముంటే నేను మహాపాపమును పొందిన వాడినవుతాను. నువ్వు ధరించే దుస్తుల కంటే మంచివాటిని ముందుగా నాకమరుస్తున్నావు. నాకు రుచికరంగా వుండే పదార్థాలను తెప్పించి తల్లికి మించిన వాత్సల్యంతో దగ్గర కూర్చుని భుజింప జేస్తున్నావు. ఇంతకూ నావల్ల నీకు జరిగే ప్రతిఫల మేదిన్నీ కనుపించదు. నీకు నాపై కారణంలేని యీ అపారప్రేమ యెందుకో తెలియదు."

"ప్రేమించడానికి కారణం!"

"అవును జ్యోషీ! దానినే నేను తెలుసుకో గోరుతున్నాను."

"ఏకనాధ్! ఆకారణం నాకే తెలియనప్పుడు నీకేమని చెప్పను? దీనిబట్టి ప్రేమకు కారణముండదేమో నని నావూహ."

ఏకనాధ్ ఆమె చెప్పినదానిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఆమె మాటలాగే ప్రతివాక్యంలోనుంచీ, కోల్లాదిగా అమృతబిందువులు వర్షిస్తూ వున్నట్లుగా, అతనికి గోచరమయింది.

"ఏకనాధ్! మాటలాడకుండా, నావయిపలా చూస్తున్నావెందుకూ? నామాటలు నీ కాశ్చర్యంగా వున్నాయా!"

"జ్యోషీ! నువ్వే స్వర్గలోకంలోనుంచో అవతరించిన దేవీమూర్తివి లాగున నా కళ్ళకగుపిస్తున్నావు—"

"అయితే—ఏకనాధ్!........" అంటుంటే, ఆమె పెదవులపై యెందుకో అంకురించిన చిరునవ్వట్టె నిలిచిపోయింది..

"చెప్పు జ్యోషీ—చెప్పు. సందేహించకు. నీనోటినుంచి వెలువడిన ప్రతిమాటా అమృతపూరితమై వుంది—"

"నన్ను పెళ్లిచేసుకుంటావా ఏకనాధ్!" అన్నమాట లామె నుంచి అప్రయత్నంగా వెలువడ్డాయి. ఆలాగున అడిగి ఆమె అతని ముఖభావాన్ని పరీక్షిస్తూ వుంది. అప్పుడతనిలో వెలిగిన నూతన కాంతి నామె గమనించకపోలేదు.

"ఏకనాధ్! నీముఖములోని భావం హృదయంలోకూడా వుంటే, నేను ధన్యురాల్ని."

"జ్యోతీ! నా కటువంటి అర్హత వుందా!" అని అతడు కంపితస్వరంతో అడిగాడు.

"ప్రేమకు అర్హత కలిగించగలిగిన దేది?"

"పవిత్రహృదయం."

"ఏకనాథ్! అది నీలో వుంది."

అత డానందపరవశు డౌతున్నాడు,

"నా దేవుడు ఏసుప్రభుననీ - నేను కులగోత్రాలు లేని అనాథాశ్రమంలో పెరిగినదాని ననీ నీమనస్సులో కించిత్తయినా సందేహం లేకుండా వుంటే, నీ ఆత్మీయులూ - బంధువులు - నిన్ను వెలిగా యెంచుతారని నీకు భయం లేకపోయినట్లయితే..." అని ఆమె యింకా యేమో చెప్పబోతుండగా అత డామె మాటకడ్డొచ్చి—

"జ్యోతీ! బంధువులు చేసిన నిరాదరణకూ ఆత్మీయులు జూపిన నిర్దాక్షిణ్యానికీ నాహృదయం కరుడుగట్టి శిలారూపం దాల్చింది. వారి వల్ల కలిగే వెలిశిక్షకు గాదుగదా ఉరిశిక్షకయినా నేను జంకను."

"ఏకనాథ్! భర్తగా స్వీకరించ వలసిందని ఏసుప్రభువు నిన్ను నాకు ప్రసాదించాడు. అందుకే మనయిరువుర ఆత్మలూ ఒకటి కానడమే నిదర్శనం."

అంటూ ఆమె అతనిచెయ్యి పట్టుకుంది. అత డామెచేతిలో చేయి వేశాడు. చేరువవృక్షాగ్రం మీద నున్నకోయిలజంట తనశ్రావ్యగ్గానంతో వారికలయిక నామోదించింది. ఆజన్మాంతమూ భార్యాభర్తలై మెలగడానికి వారు హృదయాలలోనే ప్రమాణ వాక్యాలు చెప్పుకొన్నారు. ఆనందభారంవల్ల అయిదునిమిషాల వరకూ యెవరూ మాటలాడ లేదు.

అనంతరం—

"జ్యోతీ! నా కిప్పుడు స్వర్గాధిపత్య మబ్బినట్లుగా వుంది,"

అని అతనంటే—

"అంతకంటే గొప్పపదవి యేమయినా వుంటే అది నాకు లభించినట్లుగా వుంది."—అని ఆమె అంది.

"మన యిరువురి జీవిత చరిత్రలలోనూ కూడా ఇది ఒక శుభ దినం జ్యోషీ!"

"ఏకనాథ్! బ్రతికినంత కాలమూ మన మిద్దరమూ యిదే విధంగా కలిసివుంటాము కాదూ?"

"అవును జ్యోషీ! యిద్దరమూ యిదేవిధంగా కలసి వుంటాము. కాని, నువ్వు సంపాదించడము -- నేను కూర్చుని తినడము, ఏమంత బాగుండ లేదు. మన సంసార పోషణకు నేనుకూడా యేవిధంగా నయినా పాటుపడాలి. లేకపోయినట్లయితే, నాకు తృప్తిలేదు."

"అందు కింతలోనే త్వరపడవలసిన అవసరంలేదు. కొద్దిరోజులలో మా మిసెస్ దొరసాని, మోయిరమ్మ యిక్కడకు రానైవుంది. ఆమెకు నేనంటే అమితమయిన గౌరవ వాత్సల్యాలున్నాయి. మన మిద్దరమూ భార్యా భర్తలమయిన విషయమును చెబుతాను. ఆమె పరమానందము ననుభవిస్తుంది. ఆమెద్వారా నీ కేమిషనులోనయినా, యిక్కడ ఉద్యోగమున్నా తప్పక దొరుకుతుంది."

"నీమాటయుం డా దొరసానమ్మ కంతటి గౌరవమున్నదా జ్యోషీ?"

"చూస్తావుగా, నేను చెప్పడ మెందుకు?"

"అయితే ఆమె యీ రంగూను పట్టణ మెప్పు డొస్తుంది జ్యోషీ?"

"యుద్ధం ప్రారంభం కాగానే వస్తుంది. జపానీయులు ఈ నగరంపై దాడి ప్రారంభించగానే, ఆమె యిక్కడకొచ్చి ముఖ్యములయిన యేర్పాట్లు చేస్తుంది."

"అయితే జ్యోషీ! యుద్ధసమయంలోకూడా మన మిక్కడనే వుంటామా?"

"ఆ సమయంలో యిక్కడవుండి, గాయపడిన వారికి, రోగులకు ప్రత్యేక సేవలు చెయ్యడానికేగదా, నే నిక్కడకు వచ్చింది? ఎ. ఆర్. పి. సర్వీసులో నాకు మంచిపేరు వస్తుందని, దొరసానమ్మ ఆసించి వుంది.

నే నదేవిధంగా, నన్ను పెంచిన ఇండస్ట్రియల్ హోంకును -- యజమానియైన మోయరమ్మకనూ మంచి పేరును తేగలను."

అని జ్యోషి చెప్పినదాని కత డేమీ చెప్పలేదు.

"ఏకనాథ్! యుద్ధమంటే నీకు భయమా! బాంబులు మీద పడతాయని ఖంగారుగా వుందా?"

అప్పటికీ కూడా అత నేమీ సమాధానం చెప్పలేదు.

"ఏకనాథ్! ఇలాచూడు! ఏసు ప్రభువును నమ్మినవారి కెప్పటికీ ప్రమాదం రాదు. అంతేగాకుండా మనం ప్రజాసేవ చెయ్యడానికి మాత్రమే జీవిస్తున్నాము. మన ప్రాణాలు పోయినప్పుడు ప్రజాసేవకులలో లోటు వస్తుంది. అది ఏసు ప్రభువుకు యిష్టముండదు కనుక, ఎటువంటి భయంకర యుద్ధ సమయంలోనయినా, ఏసుప్రభువు మనకు ప్రమాదము రానీయడు. ఈ నమ్మకము నే నువ్వుకూడా కలిగి వుండాలి."

"జ్యోషీ! నీలాంటి పవిత్ర హృదయుల వాక్యంలో సత్యముంటుంది. నీలాంటి దయామయులలో భగవంతు డుంటాడు. నీకు గల విశ్వాసమే నాకున్నూ వుంటుంది."

అని ఏకనాథ్ చెప్పిన మాటతో జ్యోషీకి పరిపూర్ణానంద మయింది.

"ఏకనాథ్! ఈనాడు మన యిరువురకూ వివాహ సుమంగళదినం కనుక చర్చికి పోవాలి."

"అలాగే వెళదాము"

"మీ దేవుడుండే ఆలయానికి వెళదామా"

"జ్యోషీ! మా ఆలయంలో వుండే దేవుడొకడూ, మీ చర్చిలో వుండే ఏసుప్రభువు వేరొకడూ కాదు. 'ఏకో నారాయణః' అని మా వేదాలే చెబుతున్నాయి. కనుక ఎక్కడకు వెళ్లి ఏ దేవుని ప్రార్థించినా ఆ ప్రార్థన ఒక్కటే. అయితే మా ఆలయంలోకి క్రైస్తవుల్ని రానీయరు. కనుక మీ చర్చికే పోదాం పద."

అని అతడు చెప్పిన అనంతరం మా యిద్దరూ చర్చికి బయలుదేరి పోయాము.

## ౨

"మీ తమ్ముడు చేసిన ఘనకార్యం విన్నారా?"

"ఏమిటీ? ఏకనాథ్ ఏంజేశాడు? ఈమధ్య మన గుమ్మంలోకి రావడం మానేశాడుగా?"

"రావడం మానేశాడేమో, మనం బ్రతికిపోయాము. ఎవరో కిరస్తానీ మనిషిని పెళ్లిచేసుకున్నాడట! మీకు తెలిసిందా?

కిరస్తానీమనిషిని – పెళ్లిచేసుకున్నాడా? రామ! రామ! కుల గౌరవమంతా మంటగలిపేశాడు."

"మనల్ని తలయెత్తుకోకుండా చేశాడు. అడిగిన అమ్మలక్కలకందరకూ నేను సమాధానం చెప్పలేకుండా వున్నాను. 'ఇదేమిటమ్మా! మీమరిది కిరాస్తానీ మనిషిని పెళ్లిచేసుంటే, మీ రందరూ ఎలా ఒప్పించి వూరుకున్నారు?' అని తెలిసినవాళ్లందరూ కాకుల్లాగ పొడిచేస్తున్నారు. పోని యేపేదపెళ్లి చేసుకున్నా కొంచెం మర్యాదగానే వుండేది. కులంగానికులం - కిరస్తానీకులం!"

"ఈవిషయం నా కెక్కడా తెలియలేదు. నీకెవరు చెప్పారు?"

"అయ్యయ్యో! వూరువూరంతా, అట్టుడికిపోయినట్లు ఉడికిపోతూందండీ! నాకయినా యింతవరకూ తెలియదు. ఈవేళనే తెలిసింది. భగవతమ్మ మఠంలో ఆడవాళ్లందరూ విడ్డూరంగా చెప్పుకుంటున్నారు.

"సరి—మీఆడమళయాళంలోకే వచ్చిందన్నమాట యీ వార్త? ఈవేళ నేనుకూడా వాకబుజేసి తెలుసుకుంటాను. వాడెక్కడున్నాడో వెళ్లి నాలుగు చివాట్లు పెడతాను."

"వద్దొద్దు. మీ రాకిరస్తాని కొంపలంట తిరగొద్దు. మనల్ని కూడా కులంలో వెలివేస్తారు. అతనిఖర్మాన అతన్ని యేడవనీయండి."

"కానిడబ్బు సంపాదించలేని వాడికి పెళ్లొక్కటి తక్కువొచ్చింది గాబోలు! తుంటరివేషాలు - తుంటరిబుద్ధులు!"

"అలాగునని మెల్లిగా అంటున్నారా? అందుకనే అతను మన గుమ్మంలోకి రావడమంటే నా కిష్టముండేదిగాదు. కిట్టక నేనలా అంటున్నానని మీ రనుకొనేవారు."

"ఇప్పు డింతకూ మనం చేయవలసిందేముందీ?"

"ఏమీ లేదు. మాటలాడక వూరుకోండి. ఆకిరస్తానికొంపలంట వెళ్లనూవొద్దు - అతన్ని చీవాట్లు వేయనూవద్దు. అతనిక మనగుమ్మం లోకి రాకుండా మాత్రంకాపాడుకోండి ఈవూళ్లోవున్న మనబంధువు లందరకూకూడా యీవిషయం తెలిసేవుంటుంది."

"మా తండ్రి తాతలనాటి నుంచీ ఈకుటుంబానికి ఎంత గౌర వం! ఎటువంటి మర్యాద! అటువంటి దంతా ఈ దుర్మార్గుడి మూలంగా మంట గలిసి పోయింది. ఈపనివల్ల కులస్థుల కందరకు కూడా అగౌరవమే—"

"కానియ్యండి మన మేం చేస్తాము? అతను చేసినతప్పుకు మనం కర్తలము గాముగదా? అతని ఖర్మాన్ని అతనే అనుభవిస్తాడు—"అని భార్య చెప్పినదాని నాలకించి గోరా ఒకనిట్టూర్పును విడిచాడు.

"అయితే నువ్వు మాత్రం తక్కువ దానివా యేమిటి?"

"అదేమిటి? నామీంద కోస్తున్నారు"

"భగవతమ్మ మఠంలోకి వెళ్లడంటే మానావా?

"కొంపకు త్వరగానే చేరుకుంటున్నానుగా? తీరికగా వున్నసమ యాల్లో వెళ్ళి మళ్ళీ వెంటనే వచ్చేస్తున్నాను."

"అదిమాత్రం యెందుకని?"

ఆమె మాటలాడ లేదు.

"కామయ్యగారి భార్యకూడా వస్తూందా?"

"లేదు. ఆవేళ ఆలస్యంగా వచ్చినప్పు డతను ఆమెను మన యింటి దగ్గర ఏమీ అనలేదు గాని, తమ యింటికి వెళ్ళాక పట్టుకు చావగొట్టాడుట. అందువల్ల ఆమె ఆనాటినుంచీ మఠంలోకి రావడం మానుకొంది"

"అయితే నీక్కూడా అటువంటి పరాభవం జరగా లన్నమాట. అంతవరకూ మానవు—"

ఆమె మాటలాడ లేదు.

"ఇంతకూ ఆ భగవతమ్మ చేసేకంథకోణ మేమిటో ఎవరికీ అర్థంగాదు. వేదాలు చదివిందా? శాస్త్రాలు చదివిందా? ఏవృద్ధరీ లేదు. 'భగవతి'— 'భగవతి' అని జపిస్తూ కూర్చుంటే భగవంతుడు ప్రత్యక్షమవుతాడంటుంది. అంతేనా?"

"ఆ విషయం మీకు తెలియదు వూరుకోండి."

"నాకు తెలియదు. పోనీ నీ కెప్పుడయినా భగవంతుడు ప్రత్యక్షమయినాడా! ఆవిడమాత్రం ఇంద్రియ నిగ్రహం కావాలంటూ తాను ఇంద్రియపుష్టికి అవసరమయిన పదార్థాలను తింటూ వుంటుంది."

"అవన్నీ ఎందు కొచ్చినమాట లండీ! ఆవిడ భోజనం చెయ్యదు. అందువల్ల అటువంటి వేటినయినా తింటుంది. ఆమాత్రం దానికి మీ రటువంటి పేర్లు పెట్టడం చాలాతప్పు—"

"సరే ఈ గొడవకేం గాని ఇప్పుడు పీకలమీది కొచ్చిన వ్యవహార మిదోటుంది!"

"అదేమిటి?"

"యుద్ధవార్తలు చాలాఘోరంగా వస్తున్నాయి. జపాను ఈ రంగూనుపై ఎప్పుడు బాంబుల వర్షమును కురిపిస్తుందో నని ప్రజలంతరూ పారిపోతున్నారు. చాలా మంది వూరు విడిచి వెళ్ళిపోతున్నారు."

"అవునట! నేనూ విన్నాను. అటువంటి ప్రమాదాలేవీ జరక్క ముందే మనం కూడా యెక్కడయినా సర్దుకోవడం మంచిది కాదూ?"

"సర్దుకోవాలి. అయితే ఎక్కడకు వెళ్లడమా అనేది ప్రశ్న."

"మా అమ్మగారింటికి పోదాం. ప్రయాణం కట్టండి."

"మరి నువ్వే ఆడమళయాళంలో నుంచి యువతుల కొస్తావూ? భగవతమ్మను వొదిలిపెడతావూ?"

"బాగా వుంది. ప్రాణంమీది కొచ్చినప్పు డిటువంటి వన్నీ ఆలోచించు కుంటామా యేమిటి?"

"మరి భగవతమ్మ యెక్కడకు వెళుతుంది—? వెళ్ళినా ఈ ఆడమళయాళా న్నంతటినీ వెంట బెట్టుకు పోతుందా?"

"ఏమో తెలియదు. ఆవిడతో ఎవరు వెళ్ళినా ఎవరు మానినా

సుమారు ఏభైమంది ముఖ్యశిష్యు లున్నారు. ఆస్త్రీలు ఆమెను విడిచి పెట్టరు. ఆవిడ యెక్కడకు వెళ్ళినా వా రెప్పుడూ కూడావుంటారు''

"ఎక్కడక వెళ్లేదీ యేమయినా తెలిందా?"

"అదే ఆలోచిస్తున్నారు. కాని ఈమధ్య గురుదేవికి ఒంట్లో కొంచెం నలతగా వుంటూవుంది. డోకులు- వికారము. పాప మావిడ చాలా నలిగి పోతూంది!"

"కడుపు కాదుగదా!"

"ఛీ! ఛీ! వూరుకోండి. పుట్టు బ్రహ్మచారిణికి గర్భిణీ యెలా వస్తుంది? ఆవిడ కసలు మొగజాతంటేనే పరమ అసహ్యం. మొదలు పురుషులను కూడా శిష్యులుగా చేర్చుకోవాలను కొంది. కాని ఆమె తరువాత ఆబుద్ధి మార్చుకొని, పురుషుడన్నవాణ్ణి ఆ మఠంలోకి రాకుండా చేసింది."

"పురుషజాతియందం దామె కంత ద్వేషముందన్నమాట!"

"ఆహా! ఆమెదగర పురుషుల పే రెత్తకూడదు - పురుషులాము కంటి కగపడకూడదు."

"అటువంటి దీక్ష నెందుకు పూనింకో!"

"ఆవిడ చాలా నిగ్రహంగల మనిషి. లేకపోతే ముప్పయి సంవత్సరాలనడివయస్సులో వుండిన్నీకూడా, అటువంటిదీక్షలో వుండడం కష్టం. మనసెప్పటికీ చలించకుండా వుండగలందుల కామె పురుష జాతి కంతదూరంగా వుండివుంటుంది. తనశిష్యులకన్నా అదేవిధంగా ఉపదేశాలు చేస్తూంది."

"మరయితే నువ్వుకూడా అలా చెయ్యకూడదూ?"

"అదే—మనలాంటివాళ్ల కటువంటి దీక్ష లెక్కడ సాగుతాయి? ఆవిడ సాక్షాత్తూ దేవీస్వరూపం గాబట్టి, ఎటువంటి దీక్ష నయినా కొనసాగించుకోగలదు."

"ఆవిడ మొగవాళ్లను శిష్యులుగా చేర్చుకోకపోవడంకూడా చాలామంచిది. లేకపోయినట్లయితే, ఆమెకు శిష్యులయిన ఆడవాళ్లందరూ, మొగళ్లను బాధపెట్టి ఉంపుదురు."

"ఇంకో విశేషంకూడావుంది. మొదట్లో యిద్దరు ముగ్గురు పురుషులు భగవతమ్మ దర్శనానికొచ్చి, ఆమెను ఏవేవో అర్థంలేని కొంటె ప్రశ్న లడిగారు. దానితో ఆవిడకు మొగాళ్లంటే. మరెంత అసహ్యం కలిగింది. అప్పటినుంచీ, ఏపురుషుడూకూడా మఠంలో అడుగుపెట్ట కూడదని కట్టడిచేసింది."

"సరే—నా కర్థమయింది లే—"

అని గోరా పకపక నవ్వుతూవుంటే, భవాని అతని నవ్వుకు కారణమును తెలుసుకోలేక తెల్లబోయింది.

౮

"శత్రుసైన్యాలను ఎదుర్కోవడానికి బ్రిటిష్ సైనికదళాలు రంగూను సముద్రతీరము నంతటినీ ఆక్రమించి వున్నాయి. యుద్ధ ప్రమాదాలనుంచి, ప్రజలను రక్షించడానికి అవసరమయిన ఏర్పాట్లన్నీ అంతకుముందే చేయబడ్డాయి."

బాంబులు పేలినప్పుడు ప్రజల ప్రాణ సంరక్షణ కోసం, ఊరు నిండా గోతులు త్రవ్వ బడ్డాయి. బాంబులు పేలినప్పుడు మార్గస్థుల నాగోతులలో దాగోనవలసినదిగా, ఎ. ఆర్. పి. వార్డన్లు ప్రజలకు బోధలు చేస్తున్నారు. ప్రత్యేకములయిన హాస్పటల్సు — రక్షణ శాలలు విరివిగా నిర్మింప బడ్డాయి.

జోషి కది యెంతమాత్రము తీరిక లేని సమయం. ఏకనాథ్‌తో ముచ్చటగా మాటలాడటానికి కూడా ఆమె కవకాశం లేకుండా వుంది. ఆమె అహర్నిశములూ హాస్పటలులోనే వుంటూ, తన విధ్యుక్త ధర్మాన్ని అక్షరాల నెరవేరుస్తూవుంది.

ఏకనాథ్ యింటిదగ్గర వుంటూ, ఆమెకు అవసరములయిన సహాయిలను చేస్తున్నాడు. కాని అప్పటి యుద్ధవాతావరణం చూస్తుంటే, అతనికి చాలా హడలుగా వుంది. జోషీ సుకుమారి, సుందరాంగి. ఆమె అతనికి ప్రాణదానం చేసిన ప్రాణం. జోషికి కించిత్తు ఆపద కలిగిందంటే అతడు సహించుకోలేడు. ఆమె హాస్పటలులోనుంచి తిరిగి యింటి కొచ్చేవరకూ, అతని శరీరంలో ప్రాణా లుండవు!

ఎవరికి వారు చావు బ్రతుకలు నిర్ణయించుకోలేని సందిగ్ధ సమయ మది. ఏక్షణాన నిప్పుల వర్షం కురుస్తుందో ఏనిమిషాన విష వాయువులు గ్రుమ్మరించబడతాయో!

జ్యోషి మామూలుగా యింటికి చేరుకొనే విశ్రాంతి సమయ మది. ఏకనాథ్ ఆమె రాకకై నిరీక్షిస్తూ కూర్చున్నాడు.

“జ్యోషి మూలంగా నా జీవితంలో ఒకానొక గొప్ప మార్పు వచ్చింది. ఎంతోమంది బంధువులనూ, ఆత్మీయులనూ కలిగి వుండీన్నీ కూడా, నే నాకలి మంటతో అల్లాడిపోయే సమయాన, జోషి నా పాలిట దేవీమూర్తి అయి అవతరించింది. కొసకా అపురూప సుందరాంగిని వివాహ మాడే యోగ్యత కూడా నాకు కలిగింది.”

అయితే, ఈయుద్ధపరిస్థితులలో మేమిద్దరమూ బ్రతికి, భగవంతు డిచ్చిన ఆయుష్కాలమంతటినీ సంతోషంగా గడపగలమా; ఈవిష యంలోనే నాకు నమ్మకం చాలకుండా వుంది. చాలమంది రంగూను ప్రజలు యుద్ధప్రమాదానికి భయపడి ఎక్కడకో పోయి తలలు దాచు కుంటున్నారు.

'జ్యోషికికూడా నే నీసలహా చెబితే ఆమె ఏమంటుంది? అంగీ కరించదు. బ్రతికివుంటే, ఎక్కడయినా యింత రెక్కలకష్టమును చేసు కొని, యిద్దరమూ సుఖజీవనం చెయ్యగలము. అది లేకుండా ఆ బలవ న్మరణానికి గురికావడ మెలాగు? తీరవలసిన కోరికలెన్నో వున్నయి-అను భవించవలసిన సుఖ మెంతో వుంది. ఈసమయంలో యిక్కడ నుండి ప్రాణాలు పోగొట్టుకొంటే యేముంది? ఈఅభిప్రాయమునే జ్యోషికి తెలుపుతాను. ఆమె యేమంటుంది? ఆమెకు మాత్రం సుఖవాంఛ వుండదూ? ఆమెకు మాత్రం ప్రాణాలపై తీపి లేదూ?”

అని ఏకనాథ్ తనలో తానాలోచించుకొంటున్న సమయంలో అన్నగారయిన గోరా, వెదుక్కుంటూ అక్కడ కొచ్చాడు. అతన్ని చూడగానే ఏకనాథ్‌కు శరీరం కంపించింది!

“ఇలా వచ్చావే మన్నయ్యా? కూర్చో అని అతడు కంపించే గొంతుకతో అన్నాడు.”

"చాలు - నువ్వీవిధంగా కిరస్తానీ యువతిని వివాహమాడి - ఆమె చేతికూడును తింటూ కులభ్రష్టుడవయినదే చాలక. నన్నుకూడా యిక్కడ కూర్చోమంటున్నావా?"

అని గోరా తీక్షణంగా అనడంవల్ల ఏకనాథ్ ఏమీ అనలేక పోయినాడు.

"నే నిక్కడ కూర్చోవడానికి రాలేదు. నీకు రెండు ముక్కలు చెప్పడానికి వచ్చాను. నే నిలాగ నీదగ్గరకు వచ్చినట్లు తెలుస్తే, మా వదిన నన్నింట్లోకి రానివ్వదు - కులస్థులు క్షమించరు.

అయినప్పటికి సోదరునియందు నే వాత్సల్యమును చంపుకోలేక రహస్యంగా వచ్చాను. ఈవిధంగా నువ్వీ కిరస్తానీయువతిని వివాహమాడి, యిక్కడ వుండిపోవడం యేమయినా బాగుందా? కులగోత్రాలక్కరలేమా? వంశమర్యాద అవసరంలేదా? ఎంతమంది బంధువులు- ఎందరు ఆత్మీయులు వారందరకూ దూరమై యీవిధంగా భ్రష్టత్వమును పొందడానికి నీ కెలా సిగ్గులేక పోయిందిరా?"

"అన్నయ్యా! నే నన్నదానికి ఆగ్రహించకు. కులమంటే యేమిటి? గోత్రమన్నది యెక్కడున్నది? నే నాకలిమంటతో అల్లాడిపోతూ వున్నప్పుడు ఒక్కకులస్థుడు - ఒక్కఆత్మీయుడు - చివరకు ఏకగర్భాన పుట్టిన నువ్వుకూడా నాకొక్కపూట తిండిపెట్టలేకపోయినావు.

నే నాకలిమంటతో చచ్చిపోతుంటే చూస్తూ వూరుకున్న యీ కులము - ఈ బంధువులు ఎందుకూ? ప్రాణాలు పోయేసమయంలో గుక్కెడు మంచినీళ్లు నాగొంతుకలో పోయలేని మానవుల్లో మానవత్వ మెక్కడుంది?

ఇప్పుడు నేను వివాహమాడిన యువతి క్రైస్తవురాలయినా మరెవరయినా, నేను కడుపాకలి భరించలేని మరణావస్థలో నాకు కడుపునిండా అన్నంపెట్టి ప్రాణదానంచేసిన పుణ్యాత్మురాలు. ఆమెలో మానవత్వ ముంది. ఆమె కుల మేదయినా, ఆమె దేవు డెవరయినా, ఆమెలో దయాదాక్షిణ్యా లున్నాయి. ఏహృదయంలో దయాదాక్షిణ్యాలుంటయో, ఎవరిఆత్మ యితరుల కష్టమును సహించలేదో - భగ

వంతు డక్కడే వుంటాడు - అదే ఉత్తమ కులం. కనుక, ఉత్తమకులీనులం అని విర్రవీగే వారిదే అధమకులం - ఆకులంలోనే కుళ్లంతా వుంది. నేను చెప్పేదానిని బాగా ఆలోచించుకో'' అని ఏకనాథ్ ఉద్రేకంగా చెబుతున్నదాని నాలకించినగోరా యేమీ మాటలాడలేక ఖిన్నుడై నిలుచున్నాడు.

ఇంతలో బయట ఏదో పెద్దకోలాహలం వినిపించడంవల్ల ఆ యిద్దరూ యివతల వచ్చారు. కొన్ని వేలమంది స్త్రీలు, అందరూ కాషాయాంబరధారులు - గుంపులుగుంపులుగా వచ్చి హాస్పటలుదగ్గర గుమిగూడారు. వారందర్నీ భగవతియొక్క శిష్యులని - గోరా సులువుగా గ్రహించుకొన్నాడు. అయితే ఆఆడమళయాళ మంతా హాస్పటలు దగ్గర గుమిగూడడానికి గలకారణ మేమిటో అతనికి తెలియలేదు.

జ్యోతి వారందరినీ తప్పించుకొని, హాస్పటలులోనుంచి బయట వస్తూవుంటే, ఆ స్త్రీ లందరూ ఆమెను - మాగురుదేవికి ఎలా వుంది? మాగురుదేవి బతుకుతుందా?'' అని ఉచ్చైస్స్వరాలతో అడుగుతున్నారు. వారిమాటలను గుమ్మంలో నిలుచున్న గోరా ఏకనాథులు విన్నారు.

"మీగురుదేవి మగశిశువును కని మరణించింది - యిక లాభం లేదు—''

అని మాత్రం చెప్పేసి, జ్యోతి యింటికొచ్చేసింది. ఆమె మాటలను వినగానే ఆ స్త్రీ లందరూ తలలు వంచుకున్నారు. ఎవరి ముఖానా కత్తి కాటుకు నెత్తురుచుక్క లేకుండా పోయింది. బారులు తీర్చి, నిశ్శబ్దంగా వెనక్కు మళ్లారు. ఆవిషయము నంతటినీ తెలుసుకన్నా గోరా ఒక నిట్టూర్పు విడిచాడు. కానీ ఏకనాథ్‌కు పూర్తిగా విషయ మవగాహన కాలేదు.

జ్యోతి యింటికొచ్చి, అక్కడ భర్తతో వున్న కొత్తయువకుణ్ణి చూసింది.

"ఈతను మా అన్న. నన్ను చూసిపోదామని వచ్చాడు."

అని ఏకనాథ్ జ్యోషికి చెప్పగా, ఆమె గోరాకు నమస్కారం చేసి—

"మిమ్మల్ని చూడగలిగినందుకు చేనెంతో సంతోషపడు తున్నాను." అంది.

"అయితే, జ్యోషీ! హాస్పటలువద్గర ఆగలభా అంతా యేమిటి? మరణించినవా రెవరు?"

అని ఏకనాథ్ అడగ్గా, జ్యోషి ఇలా చెప్పింది—

"ఆమె భగవతి. ఈ స్త్రీకోటి కంతటికీ గురుదేవి - మిత పెద్ద. ఆమె గర్భం దాల్చింది.-హాస్పటలులో మగశిశువునుగని మరణించింది. ఈవిషయమును తెలుసుకొని, ఆ స్త్రీలోక మంతా సిగ్గుపడుతూ వుంది. శాంతపుంది స్త్రీలకు గురుదేవి ... - ఆమె గావించిన పని నిజంగా సిగ్గుచేటు."

అని జ్యోషి చెప్పగా. ఏకనాథ్ ... ఆశ్చర్యమూ ... వుంది.

"అన్నయ్యా! చూశావా! పదినిక గురుదేవి - స్త్రీలోకాని కంతటికీ గురుమాత - ఉత్తమమతాన్ని బోధించవే ... - ఎటు వంటి పనిచేసింది?"

అని ఏకనాథ్ అడిగినదానికి, గోరా తల వంచుకున్నాడు.

"నిలుచునేవున్నారు - కూర్చోలేదేం?"

అని జ్యోషి, గోరాకు మర్యాద చేసింది—

"లేదు - వెళ్లిపోతా. ఈ దేశమంతా యుద్ధవాతావరణంతో బీభత్సంగా వుంది. ఈ సమయంలో ఎక్కడకయినా పోయి ... ప్రాణాలు రక్షించుకోవడంకంటే వేరు కర్తవ్యం లేదు. ఈవిషయమును మాతమ్మ జీకి చెప్పడానికే వచ్చా." అని ఏకనాథ్ చెప్పగా—

"మంచిది. అతను వస్తే మీతో తీసుకెళ్ళండి - నా ... అభ్యంతర మేమీ లేదు."

అని జ్యోషి చిరునవ్వు ముఖంతో చెప్పగా, ఏకనాథ్ ఏమీ మాటలాడ లేదు. దానినిబట్టి అతను వారి అంగీకారమును తెలుసు కొన్నాడు.

"నీయిష్టం ఆలోచించు -- మేము మా అత్తవారి గ్రామం పోయి, అక్కడ కొంతకాలము తలదాచు కుంటున్నాము. నువ్వుకూడా యిష్ట మయినప్పుడు అక్కడకు రా! వెళుతున్నా."

అనిచెప్పి గోరా అక్కడనుంచి వెళ్ళిపోయినాడు. అనంతరం జ్యోషి. ఏకనాథ్ లీ విధంగా మాటలాడు కున్నారు.

"అయితే జ్యోషి! ఆడమళయాళానికి గురుదేవియయిన భగవతి చనిపోయిందన్న మాట?"

"ఆమె దుర్మరణానికి స్త్రీలోకమంతా తలలు వంచుకుంది."

"కావలసిందే"

"గురుదేవినని చెప్పుకొంటూ, ఉపదేశాలు గుప్పిస్తూ, తాను మహా వేదాంతినని, ఆవిడ చేసిన ఘనకార్యమిది. ఇంద్రియముల నిగ్రహించుకోలేక, చేసిన అవినీతికార్యంవల్ల గర్భమును కలిగించుకొంది. ప్రసవ మవడం అతికష్టసాధ్యమై పోయింది. అందరమూ చాలా శ్రమ పడ్డాము కాని, మాట దక్కలేదు."

"అటువంటి డాంబికులు - మోసకత్తెలు, ఈ లోకంలోనుంచి వేరు కావడమే మంచిది."

"నిజమంతే, అయితే మీ అన్నగారెప్పుడూ లేనిది మనయింటి కొచ్చారేం యీవేళ?"

యుద్ధ పరిస్థితులలో యెక్కడికయినా వెళ్ళిపోవలసిందని హెచ్చరించడానికి వచ్చినట్లున్నాడు. తాను సంసారముతో అత్తవారిల్లు చేరుకుంటున్నాడుట!"

ఆమాటల నాలకించిన జోషి ఒక్క చిరునవ్వు నవ్వి వూరుకుంది.

"అయితే జ్యోషీ! జరుగబోయే జపానుల దాడివల్ల, ప్రమాదా లెక్కువగా జరుగుతాయని, అందరూ పట్టణమును ఖాళీచేసి వెళ్లిపోతున్నారుకదా! మనసంగ తేమిటి? నిష్కారణంగా బాంబుల వర్షానికి గురికావడ మెందుకు?"

"అందువల్ల మనంకూడా యెక్కడికయినా, వెళ్లిపోదామా?"

అతడు మాటలాడ లేదు.

"ఏకనాథ్! కొంతకాలం నిన్ను యెడబాసి వుండడానికి నా కేటువంటి అభ్యంతరమూ లేదు. నువ్వు యెక్కడకయినా వెళ్లి కొంతకాలం గడపవచ్చు. అవసరమయిన డబ్బును తీసుకు వెళ్లు—"

"మరి నువ్వో?"

"ఏకనాథ్! యుద్ధ సమయంలో మరొకచోటుకు పారిపోవడానికి గాదు దొరసానమ్మ నన్నిక్కడకు పంపింది! నా కంఠంలో కొనప్రాణ మున్నంతవరకు, ప్రజాసేవ చెయ్యడమే నా దీక్ష. బాంబులే గాదు - నా తలపై అగ్నివర్షము కురిసినా, నేనా అపాయాల నన్నింటినీ యెదుర్కోవడానికే యిక్కడకొచ్చాను.

ప్రజాసేవలో - యజమానులు నియమించిన కార్యంలో ఈ తుచ్ఛములయిన ప్రాణాలు పోతేయెంత? నేను బాంబులకు భయపడి- యుద్ధానికి జంకి, యెక్కడికయినా పారిపోతే, గాయపడినవాళ్లు, రోగులకూ నేను చెయ్యవలసిన సేవల నెవరు చేస్తారు?"

అని జ్యోతి చెప్పిన మాటల నాలకించాడు ఏకనాథ్. క్షణమాత్రకాలం తనలో తానేమో ఆలోచించుకొని, తుది నిశ్చయానికి వచ్చాడు.

"జ్యోతీ! నువ్వే అటువంటి దీక్షను వహించినప్పుడు ఇక నే వసగా యెంత? నువ్వు లేనప్పుడు నేను బ్రతికిమాత్రం యేం ప్రయోజనం? కనుక, బ్రతుకుతే యిద్దరమూ బతకాలి. చనిపోతే యిద్దరమూ చనిపోవాలి. నేను నిన్ను విడిచి ఎక్కడకూ వెళ్లలేను. జ్యోతీ! నన్ను నీతో కలిసి చనిపోవడాని కనుమతించు—"

అని ఏకనాథ్ చెబుతుంటే, జ్యోతి కళ్లానందంతో మెరిశాయి. ఆమె అతని రెండు చేతులూ పట్టుకొని—

"ఏకనాథ్! ఏసు ప్రభువు దయామయుడు. అతడు దయగల వారిని రక్షిస్తాడు!" అంది.

౯

"ఇప్పుడేమిటీ చెయ్యడం? సామాను మోయడానికి బళ్లు లేవు- స్టీమర్లు వెళ్ళడం లేదు."

"అయితే? కొంప మునిగిందన్న మాట! తీరా నెత్తిమీదికి కత్తొచ్చి పడేవరకూ మీకు చీమ కుట్ట లేదు. ఇప్పుడేం చేస్తారో చెయ్యండి. బాంబులు మీద పడేసుకు చచ్చిపోవాలి గాబోలురా. భగవంతుడా!"

"ఓపని చేదాం. ఎక్కడివి సామానులు అక్కడే విడిచి పెట్టేద్దాం. కొద్దిగా ముఖ్యమయిన సామానులను మూటలు గట్టి చంకను పెట్టుకొని చక్కాపోదాం."

"ఎక్కడికి పోదాం?"

"ఎక్కడికో ఒక చోటకు - తెల్లవారుఝామున ఏమూడు గంటలకో బయలు దేరామంటే, పదిగంట లయేటప్పటికి ఏ పల్లెటూ రయినా చేరుకుంటాము."

"ఈలోపుగా బాంబులు పడవూ?"

"ఫరవా లేదు."

"సామానంతా విడిచిపెట్టి చక్కా పోదామంటా రేమిటండీ! మళ్ళీ కొనుక్కో గలమా?"

"ఏదో ఒకటవుతుంది. వీలు లేనప్పుడేం చేస్తాం?"

"అందరూ వెళ్లిపోతున్నారు - మనం కూడా వెళ్ళిపోదామండీ! అని నే నెంత కాలంనుంచి మొత్తుకుంటున్నాను చెప్పండీ? ఇంకా ఫరవా లేదు - ఇంకా ఫరవా లేదంటూనే గడిపేశారు. మానాన్న గారొచ్చినప్పుడు నన్ను పంపేస్తే బాగుండేది గదా!"

"నువ్వు సురక్షితంగా వుంటేచాలు - నేను చచ్చిపోయినా సరే నన్నమాట?"

"అలాగునని ఎవ రన్నారూ?"

"మరి నువ్వనే దేమిటీ?"

"మీ యిష్ట మొచ్చినట్లు చెయ్యండి బాబూ! నాకు తెలియదు. అక్కడ మావాళ్లు నాకోసం బెంగపెట్టుకొని చస్తారో యేమో."

"అంత ప్రేమవున్నట్లయితే, మళ్ళీ ఓమారు రాకూడదూ! వాళ్ళకు స్వంత బండి వుంది - దాన్ని పంపకూడదా?"

"అయితే ఓపని చెయ్యండి. రేపు ఎవరిచేతనయినా మావాళ్ళకు కబురుచేయండి. బండి పంపుతారు."

"ఇక్కడ నుంచి మనం కబురుచేసి అక్కడనుంచి మీవాళ్లు బండి పంపేనరకూ సావకాశ మెక్కడిది? ఇక్కడ నుంచి మీవూరుకు కాలినడ కయితే రెండు రోజులు ప్రయాణం."

"కామయ్యగా రిప్పటికి పదిహేనురోజులకిృత మే పెళ్ళాం బిడ్డలను సామానులను అత్తవారింటికి తోలేశాడు. అదృష్టమంటే అలా వుండాలి. ప్రతివిషయంలోనూ మన సుస్త్రీయే మన కొంపముంచుతూ వుంది"

"అయిపోయిందేదో అయిపోయింది గాని యిప్పుడు జరుగవలసిందేమిటో త్వరగా చెబుదూ?"

"ఏంచెప్పనూ? మీతమ్ముడి యొక్క సమాచారం మేనుయినా తెలిసిందా?"

"వా డిక్కడే వున్నాడు."

"ఆకిరస్సాని మనిషి దగ్గరేనా?"

"ఆ! అక్కడే."

"రామ! రామ!"

"అలా అననక్కర లేదు. మీగురుదేవి చేసిన ఘనకార్య మేమిటో చెబుదూ! ఇంద్రియ నిగ్రహమనీ - పురుష ద్వేషమనీ-వేదాంతాలుచెప్పి చివరకు హాస్పటలులో బిడ్డను కనిచచ్చింది. నీలాంటి పిచ్చిముండ లందరూ అదో భగవత్స్వరూపురాలని మతులు పోగొట్టుకొని యిళ్ళల్లో వుండేడబ్బు నంతటినీ దోచి పెట్టారు."

"బాగుందండో! ఆవిడ యిటువంటి మోసగత్తె అని తెలుస్తే ఒక్కరూ దగ్గిర చేరరు. తెలియక పోబట్టి అందరతోపాటు నేనూ మోసపోయాను."

"ఇంతకూ మీ తప్పేమిలేదు. ఇప్పటి ప్రపంచమెలా వుందంటే, పయికి ఘాటుగా కబుర్లు చెబుతూ లోలోపల యెటువంటి గోతులు తీసినా చెల్లుతూవుంది. అంతేగాని, నిజాయితీగా భగవంతుడి ముఖము చూసి ప్రవర్తించే వారికి రోజులు గడవ్వు."

"ఆమాటకూడా నిజమే."

"నిజంగా మా ఏకనాథ్ పెళ్లి చేసుకున్న యువతి క్రైస్తవురాలయితే నేం, మరి యెవరయితేనేం? ఆమెలో వుండే దయాదాక్షిణ్యాలు—పరోపకార బుద్ధీ మనలో లేవు. ఆమెను చూస్తే పాపాలన్నీ పోతాయి."

"కొంపతీసి, మీరుగాని, వాళ్ల యింటికి వెళ్ళారా యేమిటండీ!"

"అబ్బే! లేదు. మాటవరస కలా చెబుతున్నాను."

"వెళ్ళకపోతే ఆమె సంగతులన్నీ మీ కెలా తెలుసు?"

"తెలిసినవాళ్ళు చెప్పుకొంటూ వుంటే విన్నానంతే."

"ఎవ రెలాపోతే మన కెందుకుగాని ప్రస్తుతం ఈబాంబుల బారిపడకుండా మన మీ వూరునుంచి తప్పించుకొని పోయేమార్గం చూదురూ!"

"అదే ఏమీ పాలుపోకుండా వుంది."

ఇంతలో వంటయింట్లోవున్న బిందెను పిల్లి కిందికి తిరగ దోయడంవల్ల పెద్ద చప్పుడయింది. భార్యాభర్త లిద్దరూ హడిలి పోయారు—

"అమ్మయ్యో! బాంబు!"

అని భవాని ముందుగా రెం డురకలలో వెళ్ళి వీధిలో పడింది..

"చచ్చా మరో్రియ్! బాంబులు! బాంబులు!" అని పిచ్చి కేకలు వేయడం మొదలు పెట్టింది. చప్పుడయిన మరో అయిదు నిమిషాలకు గోరా మెల్లిగా వంటయింట్లోకి వెళ్ళేడు - పిల్లి మజ్జిగ తాగుతూవుంది.

అతడు పకపక నవ్వుతూ యివతల కొచ్చాడు.

"ఓసి నీ అసాధ్యంగూలా! బాంబు గాదు. పిల్లి బిందిని తిరగ దోసింది—"

అని భార్యతో చెప్పగా—ఆమె చిరునవ్వు ముఖంతో తిరిగి లోపల కొచ్చి—"అబ్బ! ప్రాణం హాడిల్లి పోయిందంటే. గుండెల్లో దడ యింకా పోలేదు. నే నింక యిక్కడుండను — నన్ను పంపెయ్యండి."

అని ఆమె అంటూ వుండగా, ఆయింటిముందునుంచి ఒక ఒంటెద్దుబండి వెడుతూ వుంటుంది.

"ఏమండోయ్! కామయ్యగారూ! ఎక్కడికీ ప్రయాణము?"

అని గోరా పలకరించడంవల్ల అతను బండి నాపు జేయించి దిగివచ్చి "ఇదేమిటి? ఓపక్కనుంచి బాంబులవర్షం కురవడానికి సిద్ధంగా వుంటే, మీ రింకా కదలరేం?" అని అడిగాడు.

"అదేనండి ఆలోచిస్తున్నాము. బళ్లులేవు—స్టీమర్లు వెళ్ళడం లేదు. ఏమిచెయ్యడానికి పాలుపోక ఆలోచిస్తున్నాము."

అని గోరా చెప్పగా—

- "అఘోరించి నట్లుగానే వుంది వ్యవహారం. నేను నెలరోజుల క్రితమే ఆడవాళ్లను పిల్లలనూ దాటించేశాను. ఇప్పుడు కొద్దిగా సామానుంటే, దానిని నేను వేసుక పోతున్నాను. మీరు కూడా త్వరపడండి—త్వరపడండి, ఇక లాభం లేదు."

అని కామయ్య హెచ్చరించడంతోనే భవానికి మరింత ఖంగారు పుట్టింది.

"చివరికి మా ప్రాణా లీ బాంబులకు అర్పితం కావలిసిందే! మావారెటువంటి తెలివితక్కువ చేశారో చూడండి. నేను నెలరోజుల నుంచి మొత్తుకొంటూవుంటే వినక, పీకలమీదికి కత్తులొచ్చి పడే సమయంలో, స్టీమర్లు వెళ్లవు—బళ్లు లేవు—అంటున్నారు విన్నారా? మా అమ్మవాళ్ళు నాగురించి యెంతగా యేడుస్తున్నారో యేమిటో! ఆ మధ్య మా నాన్నగారొచ్చి నన్ను పంపవా అని అడుగుతే పంపారు గారు. నా నూరేళ్ల బ్రతుకూ యింతటితోనే సరి. గాబోలు!"

అని భవాని వెక్కి వెక్కి యేడవడం మొదలు పెట్టింది.

"ఓయ్!' వెర్రిమొగమా! బాంబులు పడితే! నువ్వేగాని, నేను చావనా యేమిటి? ఎందుకలా యేడుస్తావు? ఎక్కడకో ఒక చోటుకు ఏదోవిధంగా వెడతాముగాని, మానేస్తామా?"

అని గోరా భార్యను ఓదార్చాలని చూసాడు. "అదేంమాట లెండి! ఎవరిప్రాణాలు వారికి తీపి" అని అన్నాడు కామయ్య.

"ఇప్పుడు మీరీ బండిమీద, మీ వూరేనా వెడుతున్నారు?" అని భవాని యేడుస్తూ అడిగింది.

"అవునమ్మా! మావూరె వెడుతున్నా" అని కామయ్య చెప్పాడు.

"మీ వూరికి మా అమ్మగారి వూరు దగ్గరే, అక్కడనుంచి నడిచయినా పోతా, నన్ను మీతో తీసుకపోండి, పుణ్యముంటుంది."

అని భవాని అడగ్గా—

"బండిలో చోటుంటే నేను ముందుగానె చెబుతాను. అంతా సామానుతో నిండివుంది. నాకే కూర్చోవడానికి జాగాలేక, బండి వాడి ప్రక్కను కూర్చున్నాను. చూడరాదూ?"

అని ఆత డంటూవున్నా, వినిపించుకోకుండా భవాని గబ గబ వెళ్ళి ఆ సామానుల్లోనే యిరికి—ఒదిగి కూర్చుంది. గోరా యేమి అనలేక పోయాడు.

"ప్రపంచంలో యెవరి కెవరూ లేరు—ఎవరి ప్రాణం వారికి తీపిగదా! నే నేమయిపోయినా సరేనని తాను వెళ్ళి ఆబండిలో కూర్చుంది—"

అని గోరా తనలో అనుకొంటుండగా, సముద్రతీరం నుంచి "ఢాం! ఢమ ఢమా ఢమా ఢాం—" అని ప్రళయ కాలార్భాటంతో ఫెళా ఫెళా కురిసింది, బాంబులవర్షం—

౧౦

"పిల్లల కోసం తల్లులు - తల్లుల కోసం పిల్లలు - అన్నలకోసం తమ్ముళ్లూ, తమ్ముళ్లకోసం అన్నలూ, అంతటా హాహాకారాలు! వీధివీధిలోను పరుగులు - ఉరకలు! మృత్యుదేవత ప్రళయరూపం

దాల్చి, రంగూను పట్టణాన్ని నిర్మూలనం చేస్తూంది. బ్రిటిషు విమానాలు శత్రువిమానాలను గాలిలో డీకొని ప్రతిబలయుద్ధం చేస్తున్నాయి. జంకు లేక ప్రాణాలకు తెగించిన వీరులు ఎదిరి బలాలకు లొంగకుండా అతిప్రావీణ్యమును చూపుతున్నారు.

తలలు పోయిన మొండెములు - మొండెములు పోయిన తలలు గాయపడిన వారు - అవయవములను పోగొట్టుకొన్నవారు - ఎక్కడ జూచినా రక్తప్రవాహం! ఆక్రందనధ్వనులు!

ఎప్పటి కప్పుడు గాయపడినవారు మోటారులపై హాస్పటలుకు చేర్చబడు తున్నారు. హాస్పటలులోని జ్యోతికి కప్పుడు ఊపిరి తిరగని సమయం. సర్జనులకు కుడిభుజముగా నిలిచి, గాయములకు కట్లు కట్టుట - కట్లు కట్టబడిన వారిని మంచములపై పరుండబెట్టి ఉపచర్యలు చేయుట ఆమెపని.

అప్పు డామె తన్ను తానే మరచిపోయి చెనుగుడాడినట్లుగా అక్కడనుంచి యిక్కడకు, యిక్కడ నుంచి అక్కడకు-పరుగు లెత్తుతూ, బాంబుల శబ్దం చెవులకు వినబడుతున్నా లెక్కచెయ్యకుండా, తన విధి విధాయకాన్ని అత్యుత్సాహంతో నెరవేస్తూ వుంది.

కాని—

"ఏకనాథ్! అత డేమయినాడో!"

అన్న తలంపులు మాత్రం ఆమెలో ఒకటి రెండుసార్లు కలిగాయి.

"అయితే యిప్పు డాతనిదగ్గర కెలా వెళతాను? గాయాలకు కట్లు కట్టబడిన వారు కట్ట బడుతూ వుండగా కొత్తరోగులు అంతులేకుండా వచ్చి పడుతున్నారు—ఈసమయంలో నేను ఏకనాథ్ నుగురించి ఆలోచించినట్లయితే నా విధ్యుక్త ధర్మానికి ద్రోహం జరుగుతుంది—"

అని ఆమె వెంటనే ప్రియభర్తను గురించిన తలంపును మనస్సుకు దూరం చేసుకొని తిరిగి కార్యరంగంలో ప్రవేశించి మధ్యాహ్నం పన్నెండు గంటలు మొదలుకొని రాత్రి తొమ్మిది గంటలవరకూ విరామం లేకుండా రోగులకు సేవలు చేస్తూనేవుంది.

అప్పుడు పెద్ద డాక్టరామెవున్న దగ్గర కొచ్చి—

"జ్యోతీ! నీ కీవుదయంనుంచీ విశ్రాంతి లేదు—భోజనం లేదు. ఇంటికి వెళ్ళి భోజనం చేసిరా!" అని చెప్పాడు.

"అయ్యో! చావు బ్రతుకలలోవున్న ఈ రోగులకంటే నా ఆహారవిశ్రాంతులు ముఖ్యంగాదు. నాకొరకు మీరువిచారించకండి."

అని ఆమె సవినయంగా చెప్పింది.

"ఫరవాలేదు. మరియొక నర్సు వచ్చి నిన్ను పంపుతుంది—వెళ్లు. అంతేగాకుండా జపాను నావికాదళాన్ని మన బ్రిటిషు నౌకాదళాలు దూరంగా పారద్రోలినట్లు తెలుస్తూ వుంది. కనుక తిరిగి వెంటనే ప్రమాదం జరుగ కూడదు—"

అని పెద్ద డాక్టరు నచ్చ జెప్పిన మీదట జ్యోతి అతను చెప్పినట్లుగా చేయడాని కంగీకరించింది. మరియొక పదినిమిషాలకు 'రిలీవింగు నర్సు' వచ్చి జ్యోతిని పంపింది.

అప్పుడు తిరిగి ఆమెకు ఏకనాథ్ తలంపులే వచ్చాయి.

"అత డసలే భయస్థుడు. అత డిప్పు డీ ప్రపంచలో వున్నాడో లేనే లేడో, బాంబులవల్ల గాయపడినట్లయితే హాస్పటలుకు గొనిరాబడకుండా యెందు కుంటాడు?—"

అన్న ఆలోచనలు తట్టిన కొద్దీ ఆమెకు హృదయవేగ మెక్కువయింది. పరుగు పరుగున పోయి ఆ దాపులోనే వున్న తన నివాసం చేరుకొంది. లోపల దీపంలేదు. తలుపులుమాత్రం దగ్గరగా నొక్కబడి వున్నాయి. వాటిని తోసుకొని, ఆమె లోపలకు వెళ్ళి చూసేటప్పటికి—

"జ్యోతీ! జ్యోతీ! జ్యోతి!"

అన్న హీనస్వరం వినిపించింది. ఆమె వెంటనే దీపమును వెలిగించి చూచేటప్పటికి—ఏకనాథ్ కిందపడివున్నాడు. బాంబుపడ్డట్టుగాని, అతని వొంటిమీద గాయాలుకాని ఏమీ కనుపించకపోయినప్పటికీ, అతని వొంటిమీద స్పృహ లేదు - ఆమె అతనికి దగ్గరగా వెళ్ళి ఒంటిమీద చేయివేసి—

"ఏకనాథ్! ఏకనాథ్!" అనిపిలిచింది అతడు త్రుళ్ళిపడి లేచాడు.

"జ్యోతీ! జ్యోతీ! మనం బ్రతికేవున్నామా?"

అని ఆమెను కౌగిలించుకొన్నాడు. దానినిబట్టి, అతడు బాంబుల శబ్దానికి బేజారై, మనస్థిమితమును చెడకొట్టుకొన్నాడని తెలుసుకుంది.

"అవును- మనము జీవించేవున్నాము—మన కెటువంటి ప్రమాదము రాలేదు, మనస్సును కుదుటపర్చుకో ఏకనాథ్"

అని ఆమె అతనిని హెచ్చరించి, మంచినీళ్లు తాగించింది. అప్పటి కతడు స్వస్థుడయినాడు.

"జ్యోతి! ఇప్పు డింక బాంబులు పటడంలేదా! నీకే ప్రమాదమూ రాలేదా?"

"రాలేదు -- ఇప్పుడు బాంబులు కూడా పడడం మానాయి."

"ఇక పడవా జ్యోతీ!"

"చెప్పలేము."

"నీకోసం నా ప్రాణ మెంతయినా కొట్టుకుంది జ్యోతీ! ఇప్పు డిద్దరమూ ఒకేచోట నున్నాము. పోతే ఇద్దర జీవాలు ఒకేసారి యెగిరి పోతాయి -- ఇక విచారముండదు."

అని అత డంటుండగానే. తిరిగి ప్రళయ కాలపు బాంబుధ్వనులు చెలరేగాయి.

"జ్యోతీ! -- జ్యోతీ!"

అంటూ అత డామెను కౌగిలించుకొన్నాడు. ఆమె అతన్ని కౌగలించుకొని, అదిమి పట్టుకొంది. ఎక్కడెక్కడ బాంబులు పేలినా, ఆపరిసర ప్రాంతాలలో మాత్రం అప్పటికీ యిప్పటికీ, ఒక్క బాంబు తునక అయినా చెదిరి పడలేదు!

"దయగలవారిని భగవంతుడు దయ జూస్తాడు."

అన్న జ్యోతి వాక్యంలో సత్యం నిలిచింది. ఏసు ప్రభు వా ప్రేమైకజీవులను కాపాడడానికి కంకణం గట్టుకొన్నాడు!! ఇహా లేని దేమున్నది?

సమాప్తము.



# సరస్వతీ బుక్ డిపోవారి నవలలు. నాటకములు.

జంపన చంద్రశేఖరరావు, ఎమ్. ఏ., బి. యిడి., గారిచే రచింపబడిన

**క్రొత్త సాంఘిక నవలలు**

| | |
|---|---|
| హారతి | రు 0-8-0 |
| పతిత | 0-8-0 |
| కూలీ | 0-8-0 |
| జ్వాల | 0-8-0 |
| ఆకలి | 0-8-0 |
| పేదరాలు | 0-8-0 |
| కులమతాలు | 0-8-0 |
| అనురాగము | 0-8-0 |
| సతి 1 భా | 0-8-0 |
| పతి 2 భా | 0-8-0 |
| ఆశ 1 భా | 0-8-0 |
| దురాశ 2 భా | 0-8-0 |
| నిరాశ 3 భా | 0-10-0 |
| కన్నీరు | 0-10-0 |
| బలిపీఠము | 0-10-0 |
| పెళ్ళి | 0-10-0 |
| కన్నతల్లి | 0-10-0 |
| ఆహుతి | 0-10-0 |

కావ్యం లక్ష్మీనరసింహారావుగారి

**క్రొత్తనవలలు**

| | |
|---|---|
| [illegible] లవర్ | రు 0-6-0 |
| [illegible] స్త్రీ | 0-6-0 |

**ప్రౌఢనాటకములు**

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే రచియింపబడినవి

| | |
|---|---|
| పాదుకాపట్టాభిషేకము | రు 1-8-0 |
| విప్రనారాయణ | 1-4-0 |
| కోకిల | 1-4-0 |
| రాధాకృష్ణ | 0-12-0 |
| సరస్వతి | 1-4-0 |
| వీరమతి | 1-4-0 |
| పూర్ణిమ | 1-4-0 |
| ముద్రిక | 1-0-0 |
| కంఠాభరణము | 1-4-0 |
| కల్యాణరాఘవము | 1-4-0 |
| విజయరాఘవము | 1-8-0 |
| ప్రచండచాణిక్యము | 1-4-0 |
| బుద్ధబోధసుధ | 1-8-0 |
| సరోజిని | 1-0-0 |
| పద్మిని | 1-0-0 |
| మాలతీమాల | 1-0-0 |
| నర్మదాపురుకుత్సీయం | 0-12-0 |
| చూడామణి | 1-0-0 |
| రాతి స్తంభము | 1-0-0 |
| విచిత్రవివాహము | 1-0-0 |

[illegible] బెజవాడ.